# వెంకన్న కోటు

బొమ్మలకథ: బాపు

**17**




















మనసు మురిపించే ఫ్రెస్కా
fresca
Beauty Talc
ఫ్రెస్కా బ్యూటీ టాల్కం.
మనోహరమైన, హాయిని గొలిపే
సువాసనను, స్వచ్ఛమైన సౌందర్య
మును మీ మీద వెదజల్లును.
ఫ్రెస్కా, దాని ప్రత్యేకమైన
మృదుత్వముతో మీ రూపమునకు
మెరుగులు దిద్దును.
ఫ్రెస్కా మృదువైనది, సువాసన
గలది—మీకు తాజా పూరితమైన
ఉత్సాహమును గొల్పును.
అందువలన ఫ్రెస్కాతో
రమణీయంగా వుండండి.
రెండు సైజులలో లభించును—
ఫ్రెస్కా
బ్యూటీ టాల్క్
గోద్రెజ్
తయారీ
పోటీలేని తాజాదనమునకు ఫ్రెస్కా!
Interpub/GSF/8/72 TL

మారినప్పటికీ అప్పటి పరిస్థితులు వేరు. నిన్నటి దాకా శ్రీమతి ఇందిరా నెహ్రూ గాంధీ ప్రభుత్వాన్ని చీల్చి చెండాడిన రంగా గారు నేడు ఆమె ప్రభుత్వం చాల గొప్పదని నిర్ణయిస్తే ఎవరు చేయగలిగింది ఏమీ లేదు.

స్వతంత్రపార్టీ లైసెన్స్, కోటా, పర్మిట్ విధానాలని అంగీకరించదు. స్వతంత్ర పార్టీ సిద్ధాంతాలని రంగాగారు చాలవరకు ఏర్పరచారు. అంతే కాదు ఆ పార్టీ జాతీయ చైర్మన్ పదవిని అలంకరించారు. అటువంటి ఒక పార్టీకి చెందిన ముఖ్య సేనాని వెళ్లి మరొక పార్టీలో అందులో కాంగ్రెస్‌లో చేరటం చాలపొరబాటు. స్వతంత్రపార్టీ సిద్ధాంతాలు మంచివా? లేక కాంగ్రెస్ పార్టీ సిద్ధాంతాలు మంచివా? అన్న విషయం ఇక్కడ అనవసరం, అప్రస్తుతం.

ఈనాడు కేంద్రంలో అత్యంత సుస్థిరమైన ప్రభుత్వం ఉన్నది. అందునా శ్రీమతి ఇందిరా నెహ్రూ గాంధీ అఖండ తెలివితేటలు గల వ్యక్తి. ఆమెకున్న రాజకీయ చతురత, ప్రతిపక్షులను తిరిగి కోలుకోకుండా చేయగల నేర్పు బహుశ రంగా గారికి తీవ్రమైన నిస్పృహ కలిగించి ఉండవచ్చు. శ్రీమతి గాంధి ఎన్నికలకు ముందే తాను చేయ దల్చుకున్న పనులు స్పష్టంగా బహిరంగ పరిచింది. వీటిని రంగాగారు తీవ్రంగా ఖండిస్తూ శ్రీమతి గాంధీ పార్టీ గెలుస్తే దేశంలో ప్రజాస్వామ్యం ప్రమాదంలో పడుతుందని, దేశంలో పారిశ్రామిక రంగం దెబ్బ తింటుందని, వ్యవసాయరంగం నమ్ముకున్న వారు అనేక ఇబ్బందులకు గురిఅవుతారని ఆవేశంగా ప్రసంగించారు. శ్రీమతి గాంధి తాను చెప్పిన కార్యక్రమాన్ని తు. చ. తప్పకుండ అనుసరిస్తోంది. ఈరోజు రంగాగారు అదే సరియైనదని అంగీకరించటం ఆశ్చర్యకరమైన విషయం.

తాను కాంగ్రెస్‌లో చేరటానికి కారణం చెబుతూ రంగా గారు ప్రజలంతా శ్రీమతి గాంధీకి వోటు వేశారు కాబట్టి తాను కూడ ఆమెని సమర్థిస్తున్నారు. ఇతర పార్టీల నుంచి కాంగ్రెస్‌లో చేరే ప్రతి వ్యక్తి చెప్పే పాటే ఇది. తాను కాంగ్రెస్ పార్టీ సిద్ధాంతాలని ఆమోదిస్తున్నాను కనుక ఆ పార్టీలో చేరుతున్నాను అంటే బావుంటుంది. రేపు మరొక సూపర్ గరీబీహటావో పార్టీ బయలు దేరి అది ఎన్నికలలో గెలిస్తే అప్పుడు రంగా తది

# ఉత్తరాలు

తర నాయకులు ఆ పార్టీలో చేరాల్సిందే కదా ఆన వాయితీ ప్రకారం.

ఏది ఏమైనా భగవంతుడు దేశానికి చేసిన గొప్ప మేలు ఒక్కటే, ఒక పార్టీ, ఒక సిద్ధాంతం, ఒక క్రమశిక్షణలేని పాత కాంగ్రెస్, స్వతంత్ర- జనసంఘ్, యస్. యస్. పి. కూడిన, నాలుగు పార్టీల ఐక్య సంఘటనను ఎన్నికలలో ప్రజలు ఘోరంగా ఓడించటం. దురదృష్టవశాత్తు వీళ్ళు గెలిచి అధికారం లోకి వచ్చి ఉంటే దేశం యొక్క భవిష్యత్‌ని వూహించుకుంటే ఎంతో భయం వేస్తుంది.

ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే గట్టి ప్రతిపక్షం కావాలి. జనసంఘం వారు పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లు పట్టణ పరిమితులని అవనీ, ఇవనీ తెగ చెబుతున్నారు. తెలియని దేవుని కన్నా, తెలిసిన దెయ్యమే మంచిదని ప్రజలు కాంగ్రెస్ వైపే మొగ్గు చూపుతారు. స్వతంత్ర పార్టీ అగ్రనాయకుల విశ్వాసఘాతుకంతో రాజకీయ దివాలా తీసింది.

మిగిలిన ప్రజాస్వామ్య ప్రతిపక్షాలన్నీ ఏకమై గట్టి ప్రతిపక్షంగా ఏర్పడి ప్రజాస్వామ్యం స్థిరంగా ఉండేట్లు కృషి చేయాలి. అనాడే ప్రభుత్వం తన హద్దులలో నడుస్తుంది. భారతదేశాన్ని సర్వేశ్వరుడు రక్షించుగాక.

జైహింద్.

—ఏ. పి. ప్రభాకర కాశీపతి, (మద్రాస్)

## సినిమా

విజయవంతంగా నడుస్తోన్న 'మానవుడు—దానవుడు' నాయకుడు శోభన్‌బాబును జనం 'క్యారెక్టర్ ఆర్టిస్టు' క్రింద జమకట్టిన విషయం రాస్తూ శ్రీనివాస్‌గారు ఈవారం పత్రికలో 'ప్రజలవాక్కు బ్రహ్మవాక్కు, దాన్ని ఎవరూ కాదనలేరు' అని అన్నారు. నిజం. ఎవరు కాదనగలరు? నిన్న ఒక్క మహానటుడి చేత ప్రశంసించ బడ్డ శోభన్ రేపటి మహానటుడు. తెలుగు చిత్రపరిశ్రమకు అత్యంత శోభను చేకూరుస్తున్న శోభన్‌బాబు తెలుగు చిత్ర పరిశ్రమకే నాయకుడు.

—ఎన్. పతి,వి. సత్య,ఎన్. మూర్తి,(మద్రాసు)




# ఆంధ్రపత్రిక వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)

శుక్రవారం: 22-9-72
శ్రీపరీధావినామసం॥ భాద్రపదమాసం॥ శు॥ చతుర్థి

సంపుటము: 60 సంచిక: 2

స్థాపితము 1908

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక


ఆలస్యమైన రైలు
త్వరలో వస్తున్నది అభ్యుదయ మార్గంలో రైలు
ఇంకా ఎందుకు రావడం లేదు?


సరస సల్లాపాలు
కాంగ్రెసు సోషలిస్టు ఫోరమ్
నెహ్రూ ఫోరమ్


అరబ్బుల మీద ఇంకా ఎలా సానుభూతి చూపిస్తాను?
ఒలింపిక్ విలేజ్‌లో తీవ్రవాదుల అల్లకల్లోలం


ముజిబ్ రావడం లేదేం? అతన్ని సత్కరించాలి!
సత్కారమా? ఛీత్కారమా?

# హైదరాబాద్ నోట్ బుక్

## తిరుమల రామచంద్ర

సహజ రమణీయాలైన జంటనగరాలు స్వాతంత్ర్య రజతోత్సవం సందర్భంగా, ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు శాసనసభా నిశీధ సమావేశంలో ఆలపించిన—

'వెలుగుటయే నా తపస్సు
వెలిగించుట నా ప్రతిజ్ఞ.'

అన్న గీత పాదాలకు అనుగుణంగానా అన్నట్టు వివిధవర్ణ దీపావళితో వెలిగిపోతూ, హుసేన్‌సాగర్ జలాశయముకురంలో తమ అందాలు చూచుకొని మురిసిపోయాయి. ఆనాడే స్వాతంత్ర్యావతరణ ప్రథమ దివసమా అన్నంత కోలాహలంతో జనసందోహం సంబరపడింది. వాడ వాడలా ఉత్సవాలూ, సభలూ, సమావేశాలు! ఓహ్! ఏమని వర్ణించగలం! రాష్ట్ర ప్రగతిని చిత్రిస్తూ, సైనిక విన్యాసాలు ఒకచోట, వివిధ ప్రభుత్వశాఖలు ఏర్పాటు చేసిన అలంకృత శకటాల ఊరేగింపు ఒక వైపు, లాల్‌బహదూర్ స్టేడియంలో రాష్ట్ర సమాచార పౌర సంబంధశాఖ ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యకలాపాలు మరొక వైపు, శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి అధ్యక్షతన రవీంద్రభారతిలో కవి సమ్మేళనం మరొక వైపు—ఇలా జంటనగరాలు సంతోష పారవశ్యంతో పొంగిపోయాయి. ఈ శుభ ముహూర్తంలోనే నవజ్యోతి లిటరరీ అసోసియేషన్ (నాంపల్లి) వంటి యువజన సంఘాలు కొన్ని అవతరించాయి.

* * *

ఆగస్టు 23 వ తేదీన జంటనగరాలలో అంతటా సంరంభంతోనే జరిగాయి శ్రీ ప్రకాశం శతజయంత్యుత్సవాలు. 'ప్రకాశమే ప్రజ; ప్రజలే ప్రకాశం' అని స్థాపించిన శ్రీ ప్రకాశంగారిని ప్రజలు [illegible]రించి గౌరవించడంలో ఏమీ శక్తివంచన చేయలేదనే అనిపిస్తుంది. ఈ ఉత్సవాల విశేషం జూబ్లీహాలులో శ్రీ ప్రకాశం జీవిత చిత్రాల ప్రదర్శనం. ఆయన ఒంగోలు తాలూకా వినోదరాయుడు పాలెంలో 1872 ఆగస్టు 23 న జన్మించినది మొదలు 1957 మే 21 తేదీన అస్తమించిన నాటివరకుగల జీవిత ఘట్టాలు—1921లో కోర్టుల నిరాకరణ, 1928 లో సైమన్ కమిషన్ ముందు గుండె ఒడ్డి నిలబడడం మొదలయినవి మొత్తం 100 చిత్రాలు ఆంధ్రపత్రిక మొదలయిన పత్రికల ఆనాటి కట్టింగులూ ఉన్నాయి, ఈ ప్రదర్శనలో.

* * *



మాజీ ఉపముఖ్యమంత్రి శ్రీ కె. వి. నరసింగరావుగారు 3వ తేది రాత్రి కీర్తిశేషులయ్యారు.

ఆగస్టు నెలలో జరిగిన మరొక గొప్ప సంగతి సంస్కృత విశ్వవిద్యాలయ స్థాపన సదస్సు. రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన ఈ సదస్సును 13 వ తేదీన మహబూబియా బాలికల కళాశాల హాలులో గవర్నర్ శ్రీ ఖండూభాయిదేశాయి ప్రారంభిస్తూ, సంస్కృతం మృతభాష కాదన్నారు. అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు 'సంస్కృతం ఒక వర్గానికే చెందినదన్న అపోహ ఉంది. దీనిని జాతీయం చేయాలి. హరిజనులకూ ఈ భాష స్వంతం కావాలి' అన్నారు. దేశం నలుమూలలనుంచీ వచ్చిన పండిత ప్రకాండులు డాక్టర్ వి. రాఘవన్ వంటివారు, స్థానిక విద్వాంసులు శ్రీ కె. లక్ష్మణశాస్త్రి, డాక్టర్ బి. ఆర్. శాస్త్రి వంటివారూ మూడు ఉపసంఘాలుగా ఏర్పడి ఎన్నో సూచనలు చేశారు. డాక్టర్ చింతామణి దేశ్‌ముఖ్, విద్యామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి సంస్కృతభాష ఆవశ్యకతను, దాని విస్తృతికి పథకాల అవసరాన్ని నొక్కిచెప్పారు.

* * *

తెలుగు అకాడెమి సిద్ధపరచిన మరి కొన్ని డిగ్రీ స్థాయి పుస్తకాలను శ్రీ తెన్నేటి విశ్వనాథం ఆగస్టు 26 న అకాడెమీ హాలులో ఆవిష్కరించారు. ఆ సందర్భంలో ఆయన చేసిన సూచనలు చాల అమూల్యమయినవి. పాఠ్య పుస్తకాల చివర ప్రచురించిన గ్లాసరీలో రష్యన్, ఫ్రెంచి, జర్మన్ భాషల పర్యాయాలనూ చేర్చాలన్నారు ఆయన. జపాన్‌వారు స్వల్ప వ్యవధిలో తమ భాషలో ఆలోచనా ప్రమాణాన్ని పెంచుకొన్నారు. ప్రపంచ దేశాలన్నిటికన్నా

ముందడుగు వేస్తున్నప్పుడు ఐదుకోట్ల మంది తెలుగువారు ఎందుకు వేయలేరన్నారు అధ్యక్షత వహించిన శ్రీ గంటి జోగి సోమయాజిగారు. అకాడెమీ డైరెక్టర్ డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు అకాడెమీ భావి కార్యక్రమం వివరించారు. దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఢిల్లీ ప్రతినిధి శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ, అకాడెమీ కృషి రాజకీయాలవల్ల వెనుకబడరాదని హెచ్చరించారు.

* * *

ఈ ఉత్సవాల సంరంభం ఇలా ఉండగా మత ప్రచారకులు పదుగు పేరుగా జంట నగరాలలో తమ కార్యకలాపాలు కొనసాగిస్తుండడం ఎవరినైనా ఆశ్చర్యపరిచేట్టు చేస్తుంది. ఒకవైపు కృష్ణచైతన్య సంప్రదాయవాదులైన విదేశ భక్తులు వాడవాడలా కృష్ణ సంకీర్తనం చేస్తుంటే శ్రీ పూరీ శంకరాచార్యుల వారొకవైపు ధర్మబోధ సాగిస్తుండగా, ఉడిపి పేజావర్ మఠం పర్యాయస్వామి ఇంకొక వైపు ఆర్షధర్మ ప్రచారం ఆచరిస్తున్నారు. కృష్ణచైతన్య సంప్రదాయ బృందంలో యునైటెడ్ స్టేట్స్, కెనడా భక్తులున్నారు. ఒక చైనా స్వామి ఉన్నారు. ప్రభుపాదభక్తి వేదాంత స్వామి నాయకత్వాన వచ్చిన ఈ పాశ్చాత్యులు కాషాయ వస్త్రాలతో, శిఖాదికం ప్రహ్లాదవేషంతో నగర పౌరులను విశేషంగా ఆకర్షిస్తున్నారు. శ్యామాలకృష్ణ గోస్వామి నాతో మాట్లాడుతూ కృష్ణుని కన్నా దైవం లేదని, గీతకన్నా మతగ్రంథం లేదని అంటూవున్నప్పుడు, అచంచల విశ్వాసం ఆయన ప్రతి అక్షరంలోను ప్రస్ఫుటమయింది.

ఉడిపి పేజావర్ మఠం సంఘ సంస్కరణ భావాలకు ప్రసిద్ధి చెందింది. స్వామి మధ్వయతులవారు; స్పష్టమైన భావాలు కలవారు. ధర్మప్రచార విషయంలోను, ఆస్తికతా ప్రచార విషయంలోను తాము ఎవరితోనైనా సహకరిస్తామన్నారు. తమకు ఆస్తిక విషయంలో ఎవరితోనూ వివాదం లేదన్నారు. వారు ఆగస్టు 27న విశ్వహిందూ పరిషత్తులో ప్రసంగిస్తూ, మనకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా, మానసిక స్వాతంత్ర్యం రాలేదన్న సంగతి విజ్ఞులు ఆలోచించవలసింది.

* * *

శ్రీనివాస్ మేనేజింగ్ పార్ట్‌నర్ శ్రీ సి. చంద్రశేఖరరావు తమ కుమారుడు శ్రీ ప్రకాష్ వివాహం ఆగస్టు 24న షాపూర్‌వాడిలో జరిగినప్పుడు, అధికారవర్గం ప్రముఖులే కాక సినీతారలెందరో హాజరయి, సినీతారల ప్రదర్శనమూ ఏమిటి అన్నంత ఆశ్చర్యం కలిగింది.

* * *

రాష్ట్ర పోలీసు సి. ఐ. డి. (క్రైమ్స్) శాఖ సూపరింటెండెంట్ శ్రీ పి.వి. రంగయ్యనాయుడుగారు ఇటీవల అపూర్వ శిల్పఖండాల అపహరణను ఆపి సంస్కృతికి గొప్ప సేవ చేశారు. పంజగుట్టలోను, వరంగల్‌లోను తమ శాఖ అధికారులు కొందరు ప్రముఖ వ్యాపారుల ఇండ్లపై దాడిచేసి 39 అపూర్వ శిల్పాలను పట్టుకొన్నారు. పాశ్చాత్యులు మనదేశంనుంచి ఒక శతాబ్దం కిందనే అమరావతి శిల్పాలు తరలించారు; అవి నేడు బ్రిటిష్ మ్యూజియాన్ని అలంకరించాయి. మనరాష్ట్రపు కోహినూరు వజ్రం మనకు తిరిగి దక్కే అవకాశమూ లేదు. మనకు వారసత్వంగా వచ్చిన శిల్ప సంపదను రక్షించడంలో పోలీసుశాఖ చేస్తున్న కృషిని ప్రతి తెలుగువాడూ ప్రశంసించక తప్పదు.

ఉపశ్రుతి:—

స్వాతంత్ర్య రజతోత్సవం నాడు నగరమంతా కోలాహలంగా ఉండగా, షాపూర్ వాడలో ఒక ఇల్లు కడుతున్నారు కొందరు కార్మికులు. 'ఏమిటయ్యా, ఈ వేళా సెలవు లేదా?' అని అడిగాను ఒక కార్మికుణ్ణి. పేరు నర్సింలు, 'మాకేంది బాజాదీవయ్యా, కడుపు నిట్టలేదూ ?' అన్నాడు పొట్ట చూపుతూ నర్సింలు.

హరిరామ్





ఇది ఒక్కటే
100% TERENE
అల్లిక చొక్కా గుడ్డ-
space king! by Cotlex®
గాలి ఆడే నేత, 100%
"టెరీన్" అల్లికకు తోడు క్రొత్త
డిజైనులు మరియు ముచ్చటనిపే
రంగులలో దర్జాయైనవి...
"స్పేస్ కింగ్" అల్లిక చొక్కా
గుడ్డలు, సొగసైన దుస్తులు
వేసుకొనే సరసులైన వారికి తగినవి.
కోట్లెక్స్ ప్రైవేట్ లిమిటెడ్
(యూనివర్సల్ ఎక్స్‌పైర్స్ వారి
ఒక విభాగము)
రైఫిల్ రేంజ్, ఎల్.బి.ఎస్. మార్గ్
ఘాట్‌కోపర్, బొంబాయి-86.
వ్యాపార వివరములకు వ్రాయండి:
ఎస్. ఎన్. మాండెల్వా
203, కల్బాదేవి రోడ్, బొంబాయి-2

# అనామధేయుడి ఆత్మకథ

## ఆర్వీయ

### సీరియల్ హాస్యరచన

## 8

నాలుగేళ్ళ తర్వాతకూడా నా జీతం అంతే, ఇంక్రిమెంట్లు తప్పితే! నా సినిమా క్లాసు ఆ సెకండుక్లాసే. నా హోదా — ఆ హోదాయే. పలుకుబడీ అంతంతమాత్రమే! సినిమాల్లో శ్రీమన్నారాయణకి ఈ రోజుల్లో 'బాక్స్?'

మనం ఎలాగున్నాం అంటే — 'గొంగళీ ఎక్కడుందయ్యా? వేసినచోటే వుంది' అన్నట్టున్నాం. ఈ ఉపాఖ్యానం విని, శ్రీమన్నారాయణకి చదువెంత అని అడగరేం? — నిజానిదారు. అందుకే మా ఆవిడ 'చదువున్నవాడికంటె చాకలి నయం!' అన్నప్పుడు 'ఔను' అని అంగీకరించక తప్పింది కాదు.

అలాగని ఆవిడ అన్న ప్రతిదానినీ అంగీకరిస్తాననుకోకండి. ఒక్కొక్కప్పుడు మహా వెడ్డ రోషం వచ్చేది. ఇదివరకే మనవి చేశాను కదండీ! మా ఆవిడకి సంస్కృతి హెచ్చు— [ఇంగ్లీషు] చదువు సున్నా అని. ఐతే బుర్ర మహా గొప్పదని గిరీశాలకి గ్రహంలో వుంటారు. అందరికీ చిత్తు కాగితాలు చిత్తు కాగితాలే! మా ఆవిడకి చిత్తుకాగితాలు కరెన్సీనోట్లు. ప్రతి చిత్తు కాగితం మహా జాగ్రత్తగా, మహా ఓపిగ్గా సేకరించి, వాటిని భద్రపరిచి, కాగితాలవాడికి యిస్తే వాడు డబ్బు ఇచ్చేవాడు. ఎన్నాళ్ళని కాగితాలు (చిత్తువి) ఇంట్లో పడి వుంటాయి? చిత్తుకాగితాలు [illegible] దొరక్కపోతే? — ఏకాగితాలైతేనేం, చలామణీ కావడానికి— మంచి కాగితా — తెల్ల కాగితాలు కూడా చిత్తుకాగితాలుగ అమ్ముడుపోతూ వుండేవి. ఎన్నాళ్ళవరకూ నాకీ సంగతి తెలియలేదు.

ఇంట్లోవున్న పుస్తకాలు, ఫైళ్లు అప్పుడప్పుడు హఠాత్తుగా మాయం అవుతూండేవి. అప్పుడది నాకు తెలిసింది. 'ఇలాగైతే ఎలా?' అని అడిగితే, ఆవిడంటుంది: 'ఈ పుస్తకాలూ, ఫైళ్ళూ, ఈ చెత్తకాగితాలూ వుండి ఎవరిని వుద్ధరించాలి; ఇల్లంతట్నీ ఆక్రమించడం తప్ప!'— అని.

ఆఫీసునుంచి ఏ కాగితం ఇంటికి తెద్దామన్నా మహాభయం ముంచుకొచ్చేది. అదంటే మానేస్తాను గాని, ఇంట్లోవున్న కాగితాలను ఏం చెయ్యను? 'ఏమిటి చెయ్యడం?' అన్న జిజ్ఞాసలో వుంటూ, ఏ ఒడ్డుకీ ఇంకా చేరకముందే ప్రళయం ముంచుకొచ్చింది.

ఒకనాడు డ్రాయర్ తీసేటప్పటికి ఖాళీ. దొంగతనం ఏమన్నా జరిగిందా — అంటే వేసిన తాళం వేసినట్టే వుంది. పోయినవన్నీ కాగితాలే...! నా స్కూలు సర్టిఫికెట్లు, ఇన్స్యూరెన్స్ పాలసీ రేడియో లైసెన్సుకూడా చిత్తుకాగితాల వేటలో ఆహుతి అయిపోయేయి. దాంతో నేను రెచ్చిపోయేను. కాని 'శాంతంభూషణం' అని వూరుకున్నాను. ఆఖరికి ఆస్తి దస్తావేజులు, కోర్టురికార్డులు కూడా మాయమై, కాగితం ముక్క అన్నది ఇంట్లో కనబడనప్పుడు మాత్రం కొంచెం గాభరా పడ్డమాట నిజమే. అవాళే కొంచెం కేకలు కూడా వేసినట్టు జ్ఞాపకం. అలాంటి విషయాలు నేను ఎంతమాత్రం అంగీకరించను. అది తప్పట. ఆ రోజున ఆవిడకి నామీద మహా ఆగ్రహం వచ్చేసింది. ఆగ్రహం వచ్చినప్పుడు ఆడవాళ్ళు చూపే రీతులు అనేకంగా వుంటాయి; అనాగరికలైన మోటు మనుషులయితే శృంగారకట్ట (అదే— చీపురుకట్ట)తో పూజచేస్తారు. విద్యావంతురాండ్రయితే పుస్తకాలు విసురుతారు. రాణివాసం వారైతే— 'జలజాతాసన వాసవాది...' అన్నట్టు పాదపూజ చేస్తారు.

ఈవిడ ఏ కోవకీ చెందకపోవడం చేత ఈవిడ ఆగ్రహం చూపే రీతి మహా విధంగా వుంటుంది. ఈవిడ గంభీర దృక్కులతో, మౌనముద్రతో అతి ప్రశాంతంగా వుంది అంటే కొంప మునిగిందన్నమాటే!

ఎందుకంటే అది తుపానుకి ముందు వుండే ప్రశాంతత.

ఇంక, ఆ రోజునుంచి ఉడుకుడుకు అన్నం, నసాళం అంటుకుపోయే కారప్పు కూరలు, వడ్డించేటప్పుడు ఆ పదార్థాలు విస్తట్లో పడతాయా, బుర్ర మీద పడతాయా — అన్నట్టు తోచే అసాధారణమైన వడ్డన, చెంబుల్నీ, గిన్నెల్నీ దబ్బలాడించడం, 'పలుకే బంగారమాయెనా?' అన్నట్లు పదిసార్లు పిలిచిన పిలుపులకి ఒకసారైనా, ముక్తసరిగానైనా మారుపలకకపోవడం— ఇత్యాది: వగైరా వగైరా ఊహ్యం బుధైః. ఈ 'కృత చర్యలు' నా మీద ప్రయోగించడం ప్రారంభించింది.

దీంతో నా బుర్ర వేడెక్కిపోయింది. ఎందుకంటే దీన్ని అహింసాయుత సత్యాగ్రహమనడమా? లేక హింసాపూర్వక

దురాగ్రహాన్నేమనాలి? ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా తెగలేదు. అహింసాయుత సత్యాగ్రహమనడానికి—వేడి వేడి అన్నంవల్ల నోటికి హింసా, కారాతికారమైన కూరల వల్ల గుండెకి మంటా, చెంబుల గిన్నెల భీషణయుద్ధంవల్ల చెవిపోటూ బాధకాలుగా వున్నాయి. హింసాపూర్వక దురాగ్రహమనడానికి - చీపురుకట్ట తిరగేయకపోవడం, పుస్తకాల్ని గిరవాటు వేయకపోవడం, రాణివాసం స్త్రీల రాక్షస చర్యలు లేకపోవడం— మహా బాధకాలుగా వున్నాయి. ఏది ఏమైనా దీన్ని సినర్జైన ఆగ్రహంగా పేర్కొనడానికి మాత్రం ఏ మాత్రం బాధకం లేదు. ఈ తిరుగుబాటును ఒక వారంరోజులు ఓపికగా విదుర్కొన్నాను. భార్యాభర్తల మధ్య ఇంత శత్రుత్వం వుండడం అవాంఛనీయం అన్న ఆలోచన ఒక్కడు హఠాత్తుగా— తటాలున మెరిసింది.

రాయబారం నడుపుదా మనుకొన్నాను. రాయబారి యెవరు? మేఘదూతను పంపుమంటే కాళిదాసు అంతవాడిని కానే! హంస సందేశాన్నయినా, కీర రాయబారమేనా పంపుదామనుకొన్నాను. ప్రబంధ యుగంలో అరణ్యప్రదేశాలు విస్తారంగా వుండడంచేత వాళ్ళకి హంసలూ, కీరాలూ విరివిగా దొరికేవి గనక, వాళ్ళు వాటితో రాయబారాలు సులువుగా నడిపించేవారు. అదీగాక, ఆ కాలంలో పోస్టాఫీసులు లేవు గనుక, అది తప్పనిసరి అయింది. ఇప్పుడు పది పైసల కార్డుతో పని తేలిపోతుంది. దానికోసం వీందుకింత బుర్ర పాడు చేసుకోవడం అన్న ఆలోచన పొడసూపింది. ఆ ఆలోచనలకి వెంటనే ప్రతివాదం కూడా వుత్పన్నమయింది.

పముఖంలో :

'రాయబారమేల? రాతకోతలవేల?
కార్డుఖర్చుయేల? కనకవేల!' అని

పించింది.

అదీగాక తిరిగి తిరిగి ఇంటికి వచ్చే మగవాడికి మందహాసానికి బదులు పెదవి బిగింపూ, అనురాగ వీక్షణామృతానికి బదులు రూక్షవీక్షణావేశం, ప్రసన్నవదన బింబద్యుతికి బదులు విషణ్ణాస్యావనతాంధకారం, ఆప్యాయతకి బదులు తూష్ణీంభావమూ విదుర్కోవడం కన్న కల్లోల ప్రపంచాన్ని విదుర్కోవడం సులువు.

"ఆలస్యాదమృతం విషమౌ" అని ఒక మధురఘడియలో సంధి సంప్రదింపులకి దిగేను. మొదట ఫలించలేదు. 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అని అనుకొన్నవాడినై ప్రయత్న సంరంభాన్ని తీవ్రతరం చేశాను. ధర్మపత్నికి చాలా చాలా పతివ్రతాధర్మాలు వపదేశించేను. అప్పుడు ఆవిడ కూడా నాకు చాలా చాలా చెప్పింది. అందులో ఒక విషయం: 'ఆ వూరికి ఈ వూరెంతో, ఈ వూరికి ఆ వూరూ అంతే!'

ఇద్దరి ఉద్దేశాలు ఏకీభవించిన తర్వాత మరి తగువేమిటి? ఆరోజునుంచీ కోపాన్ని నేను హాలాహలంలాగ కంఠం దాటనివ్వననీ, ఆవిడ గైరమ్మలా గండుతనం చూపవనీ షరతులతో సంధి చేసుకున్నాం. మేము సంధి షరతుల ప్రకారం జాగ్రత్తగా వ్యవహరిస్తున్నా, ఇరుగుపొరుగు వాళ్ళ మూలంగా అప్పుడప్పుడు బెడుసూ వుండేది. అప్పుడు కోపాన్ని కక్కలేక, మింగలేక యమయాతన పడేవాడిని. ఆ బాధ మరే జన్మలోనూ వద్దు!

* * *

మేమున్నది అద్దెకొంప. అందులో మేమూ, మరో కుటుంబంవాళ్ళూ కాపురం. ఇంటిగలవాళ్ళు లేరు. అంతవరకూ బాగానే వుంది. వాళ్ళనుంచి మా ఇంట్లో కొన్ని గృహకలతలు రేగుతూండేవి. మా

మాసాన మేము ఏదో గుట్టుగా కాలక్షేపం చెయ్యనీకుండా పొరుగింటి పుల్లాయమ్మగారి వంచి మా సంసారం నడివీధిలో పడ్డంతదేమో అన్నంతవరకూ వచ్చేది. ఆవిడ మాటల్ని పట్టుకొని మా ఆవిడ నామీదికి దాడి చేసేది. ఎంత మింగుదామనుకొన్నా నాకు వుపద్రవంగా కోపం వచ్చేది...తర్వాత యిటీవలే జరిగిన సంధిని జ్ఞాపకం చేసుకొని తగ్గేవాడిని. కాని ఎన్నాళ్ళు, ఎంతని తగ్గడం?

నేను బజారుకివెళ్ళి అష్టకష్టాలూపడి మంచికూరలు కొని తెచ్చేవాడిని. అవి చూడగానే 'పాపం తెచ్చేరు గదా!' అని అభినందనాలు చేయకపోయినా కష్టానికి తగు సానుభూతి చూపాలా? అదీ లేదు




పోనీ— అదీవద్దు— ఇదీవద్దు— గమ్మున వూరుకుంటే బాగుండునా? ఉహూఁ... అవి మా పొరుగింటి పుల్లాయమ్మగారికి చూపించి నాణెం చేయించేది. ఆవిడ కూరల నాణెంలో విన్నికైన మనిషి— అని వూరంతా పుకారు. నాణెం చెయ్యడమంటే యేమిటి? 'బాగులేవు' అని ముఖంమీద చెప్పడంలో ఆవిడకావిడే సాటి. 'బాగుంది' అంటే విమర్శ అనిపించుకోదు. 'విమర్శ' అనిపించుకోవాలంటే 'బాగులేదు' అని నిక్కచ్చిగా చెప్పాలి; బాగున్నా సరే! ఇదీ ఆవిడ ఉద్దేశ్యం. ఆవిడ

ఔద్ధత్యమన్న మాటేమిటి? విమర్శకులందరి ఔద్ధత్యమూ దాదాపుగా అంతే! అప్పుడే 'పూర్తైన విమర్శ' అన్న పెద్ద పేరు అయాచితంగా వస్తుంది. ఈవిడకి చూపించిన ప్రతివస్తువునీ 'బాగాలేదు' అంటుంది. ఏలాగైనా ఈవిడచేత 'బాగుంది' అనిపిద్దామన్న తాపత్రయం చాలామంది పడేవారు. దాంతో అమాంతంగా ఆవిడ కూరలనాణెంలో నిపుణురాలు అయి వూరుకుంది. ఇక, మా ఆవిడ ఈ 'నిపుణురాలి' సంగతి తెలుస్తూనే ఒకనాడు కూరలు చూపించడానికి ఆవిడదగ్గరకి వెళ్ళింది. ఆవిడ తన మామూలు అలవాటు చొప్పునే 'ఈ కూరలేం బాగోలేవు' అని సమీక్షించింది. పోనీ బాగులేవే అనుకోండి 'బాగానే వున్నాయి' అంటే ఈవిడ సొమ్మేం పోయింది చెప్పండి. ఉహూం... అలా అన్లాటప్పాగా అనేస్తే ఆవిడ గొప్పతనానికీ, ఆవిడ పేరుకీ తీరనిదెబ్బ గదూ! ఆవిడగారు తర్వాత 'కూరలు ఎలా కొన్నారు?' అని వాకబు చేసిందట. మా ఆవిడ చెప్పిందట. 'వంకాయలు కిలో 0 44 పైసలూ, బంగాళాదుంప కిలో 0 50 పైసలు' వగైరా. వెంటనే పుల్లాయమ్మగారు పెదవి విరిచేసి 'మా ఆయన ఈ వంకాయలే కిలో 37 పైసలికీ, బంగాళాదుంపలు కిలో 44 పైసలికి కొన్నారు. మీ కూరలకన్నా, మా కూరలే బాగా తాజాగా వున్నాయి. మీ ఆయనకి బేరం తెలీదు. సారం తెలీదు. నాణెం అంతకన్నా తెలీదు.' అని అంటూ కొంత అనవసర, అప్రస్తుత, అసంగత, అవివేక, అధికప్రసంగం కూడా చేసిందట! 'మీ ఆయనకి పుస్తకజ్ఞానమే కాని లోకజ్ఞానం బొత్తిగా లేదు. మా



# అనామధేయుండి ...

ఆయన వెర్రి మొర్రి పద్యాల్రాయరు. వెర్రి వేషాలు వేసి ఆడరు. కాని సంసారం మహా గుంభనగా చేస్తారు. సంసారాన్ని చక్కగా పొదుపుగా జాగ్రత్తగా చూసుకోకపోతే తెలివితేటలు యెందుకూ, ఏడవను?' అని ఆ అపూర్వ పతివ్రతా శిరోమణి నామీద, నా నాటక కళా జీవితం మీద, నా సాహిత్య వ్యాసంగం మీద తనకి వున్న అక్కసునంతటినీ వెళ్ళగక్కింది.

ఇన్ని మాటలు నన్ను పరస్త్రీ అన్నపుడు దెబ్బకి దెబ్బ మా ఆవిడ తియ్యాలంటారా? లేదా? అక్కడినుంచి చల్లగా తోక ముడుచుకొని వొచ్చి, మా ఆవిడ తారాజువ్వలాగ నా మీదకి లేచింది. 'ఆ పొరుగింటి పుల్లాయమ్మ మొగుడు 'అన్నీ నిక్షేపంగా చవకధరలో తెస్తాడు. మీకు బేరం తెలీదు. సారం తెలీదు. నాణెం అంతకన్నా తెలీదు. మీకు చేతకాదు. నాతా కాదు...!' ఇలాగ, ఆవిడ అన్న మాటలు కొన్నీ, మా ఆవిడ ఎన్నాళ్ళనుంచో నా మీద దులుపుదామనుకుంటూన్న మాటలు కొన్నీ, నా చెవిలో జొరబడగానే నాకు కోపం అప్రతిహతంగా ముంచుకొచ్చింది. ఆ పైన ఒళ్ళూపై తెలిసింది కాదు.

కాని, ఇంతలోనే నేనూ మా ఆవిడా చేసుకొన్న యుద్ధవిరమణ సంధి నాకు జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఒకటి...రెండు ...అని లెక్కపెట్టసాగేను. ఈ లెక్కపెట్టడం యెందుకంటే—బాగా కుత్తుక బంటి కోపం వచ్చినపుడు పదిదాకా లెక్కపెడ్తే కోపం చల్లారుతుందనీ, లేకపోతే ఆ కోపం తన్నే మింగేస్తుందో అవతలి వ్యక్తినే మింగేస్తుందో చెప్పలేం అనీన్నీ, ఎక్కడో చదివిన జ్ఞాపకం. అంతట కోపం చల్లార్చుకొన్నవాడనై అన్నాను: 'వనితా, ఆగుము. వుండు. నేను 'వాడి' కీడడంగించెదన్!' అని అన్నాను. ఇక్కడ మీకొక ధర్మసందేహం వెలిబుచ్చవచ్చు. 'పుల్లాయమ్మ చేసిన తప్పుకి ఆవిడ మగడికా దండన?' అని. అదంతే. శాస్త్రం ఏమంటూంది? 'భార్య గయ్యాళైన భర్త తప్పు!' అంచేత, భర్తకి బుద్ధి చెప్పడమే శాస్త్రోక్తం. ఆ దూకుడులో 'కీటడంగించెదన్' అన్నాను. కాని, నేనందు కుప్రక్రమిస్తే నా 'కీడు' తీసెయ్యడూ? అంచేత సామ దాన భేద దండోపాయాల్లో—దండోపాయం అంతిమ ఘట్టం. సామదానాలు ఇదివరకెందరో ప్రయత్నించి విఫలులై పోయేరు. కనుక, భేదోపాయమే శరణ్యమని నిశ్చయించుకొన్నాను.

ఆ రోజు సాయంకాలమే దీని సంగతి తాడో పేడో తేల్చుకుందామని దృఢనిశ్చయం చేసుకున్నాను. లేకపోతే రాత్రి నిద్ర పడ్తుందీ ? 'ఋణశేషం శత్రుశేషం, వహ్నిశేషం' ఈ మూడున్నూ విషమవిశేష శేషాలు. వీటిని సశేషంగా ఎన్నడూ అట్టే పెట్టకూడదు.

అతనాఫీసునించి వస్తూంటే తోవలోనే అడ్డపడి, సూటిగానే అడిగేశాను. 'ఇవాళ కూరలు ఎలా కొన్నారు?' అని.

అతను వెంటనే తడుముకోకుండా, గుక్కిళ్ళు మింగకుండా, తటుకూ బెటుకూ లేకుండా చెప్పేశాడు:

'వంకాయలు కిలో 37 పైసలు; బంగాళాదుంపలు కిలో 44 పైసలు.' అని తన మానాన తను పోయేడు.

నేను నా మానాన్నపోతూ, మళ్ళీ ఆలోచనలో పడ్డాను. వీళ్ళు మసిపూసి మారేడుకాయ చేస్తున్నారేమో అనుకుంటే, భార్యాభర్తల ఇద్దరి మాటలూ సరిగ్గా సరిపోయేయి. ఇందులో తభావతు ఏమీ కనబడదు. పోనీ పుల్లాయమ్మ, తన ప్రాణనాథుడితో 'ఇలా చెప్పండి' అని చెప్పిందనుకోవడానికి ఆస్కారం ఏమాత్రమూ కనబడదు. ఎందుకంటే, ఆయనగారు ఇంటికి చేరకుండానే నేను దారి కాసేను. ఆయన చౌకగా తేగల్గిన్న ఘటమేమో అని ఒకమారు అనిపించకపోలేదు. కానీ 'ఛస్. మనల్ని మనమే తెగడుకోవడమా!' అనుకున్నాను. ఏలాగైతేనేం, వేసిన పథకం పారలేదు. ప్రథమ ప్రయత్నం విఫలం అయిందని కొంత నిరుత్సాహపడ్డాను. కానున్నది కాకమానదు — అని నన్ను నేనే వూరడించుకొన్నవాడినై, భవిష్యత్కార్యక్రమానికి సమాలోచనలు నాతో నేను సాగించేను. ఎట్టకేలకు ఒక పథకాన్ని రూపొందించేను. మా ఆవిడతో కార్యక్రమ వివరాలన్నీ తెలిపి, నాతో సహకరించమని కోరేను. ఆవిడ అంగీకారంతో కార్యరంగంలోకి ఉరికేను. (ఇంకా ఉంది)

# సింథాల్ ఇచ్చే వాగ్దానం...

సంపూర్ణ లావణ్య పోషణ

నిత్య నూతన సౌరభం

సార్థక దుర్గంధ నివార్య రక్షణ

## ...నిలబెట్టుకో కలిగింది సింథాల్ ఒక్కటే




సింథాల్ ఒక్కటే జి-11 కలిగియున్న సబ్బు.
ఈ అద్భుతమైన క్రిమి సంహారక పదార్థము, శరీర
దుర్గంధమును, చర్మ లోపములను కలిగించు
క్రిములను రూపుమాపుతుంది. ఈ విధంగా సింథాల్
మీ లావణ్యమును నిష్కళంకముగా వుంచి,
మిమ్ము రోజంతా తాజాగా వుంచుతుంది.

Interpub/GSC/5/72R Tel

Interpub/GSC/5/72R

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## వంటింటి మరణం

బెంగుళూరు శేషాద్రిపురం అణ్ణయ్యప్ప బ్లాక్ 12వ నెంబరు మూడంతస్తుల భవనంలో ఓ వాటాలో అద్దెకుంటున్న దుర్గ అనే ఒకావిడ 27వ తేదీ ఆదివారం వుదయం స్టౌ అంటిస్తుండగా చీర అంటుకుని, కాలి, అక్కడికక్కడే చనిపోయిందట.




ఆమె, ఆమె భర్త, మరది, ముగ్గురే వుంటున్నారట. ఈ సంఘటనకు పూర్వం ఆలు, మగల మధ్య చిన్న తగూవంటిది జరిగిందట. పోలీసు రంగంలోకి వచ్చి ఇది ప్రమాద సంఘటనా, ఆత్మహత్యా, లేక— అని విచారిస్తున్నారు. ఇట్స్ దెయిర్ డ్యూటీ...

## స్టౌతో మరో మరణం

బెంగుళూరు కాక్సటవునుకు చెందిన 18 ఏళ్ల సుందరి అనే వివాహిత వంటచేదామన్న సదుద్దేశంతో స్టౌ ముట్టించుతుండగా, ఆ స్టౌ పగిలి, ఆమె చీరకు నిప్పంటుకుని, ఒళ్లంతా కాలి బవురింగ్ ఆసుపత్రిలో చేర్చాక చనిపోయిందట.

## లారీలూ, జాగ్రత్త!

వినుకొండ, కర్నూలు రోడ్డుమీద 20 వ తేదీ రాత్రి ఓ 20 మంది లారీని ఆపి, మూడుబస్తాల పెసలు, ఓ బస్తా మినుములు, ఓ బస్తా కొబ్బరి కాయలూ ఊడపెరుక్కుని, లారీని వదిలేశారట...

## పోలీసులపై పోలీసు కాల్పులు

ఖమ్మంజిల్లా కృష్ణసాగర్ గ్రామ ప్రాంతపు అడవులలో దుండగులకోసం పోలీసులు, కేంద్ర రిజర్వు దళం చెరివైపునా గాలించ నారంభించారట. 18వ తేదీ రాత్రి యీ గాలింపులో హుషారు పాలెక్కువయి, రిజర్వుదళం పొరపాటున పోలీసువారి మీదే కాల్పులు వేశారట. దీని వల్ల జబ్బార్‌సింగ్ అనే పోలీసు కానిస్టేబులు, అక్కడికక్కడే చనిపోయాడట. ఒక సబ్‌యిన్స్పెక్టరుకు మాత్రం స్వల్పంగా గాయాలయ్యాయట.

## పెద్దపులి షికారు

భద్రాచలానికి 125 కిలోమీటర్ల దూరంలో వున్న పాజేడు నాగారం అనే గ్రామంలోకి వో పెద్దపులి షికారెళ్లిందట. వూరిలోని ధైర్యవంతులని కుంటున్నవారిలో వీలైనవారు ముందుకు వురికి ఆ పెద్దపులిని తుపాకులతో సుమారు 40—50 సార్లు కాల్చారుగాని, వో నాలుగైదు గుళ్లుమాత్రమే




తగిలి ఆ పులి గిర్రున తిరిగి, నేలను కరిచిందట. ఆ దృశ్యం చూసిన వో వుత్సాహవంతుడు ఆ పులిని పరామర్శించడానికి చేతివేటు దూరం వరకూ వెళ్లాడట. చావు బ్రతుకుల మధ్య వూగిస లాడుతున్న ఆ పులి వోపిక చేసుకుని, ఛట్కున లేచి, ఆ వుత్సాహవంతుణ్ని పంజాతో మోది మరీ చనిపోయిందట. ఆతడు వరంగల్ ఆసుపత్రిలో చనిపోయాడట...

## దేశంలో దారిద్ర్యం

దేశంలో 220 మిలియను జనులు—అనగా వున్న జనాభాలో 40 శాతం మింగ మెతుకులేని బీదస్థితిలో వున్నారని ఢిల్లీలో వో రాష్ట్రమంత్రి అన్నారట.

## అప్పిచ్చువాడు!

ఓడుత్తూరుకు చెందిన భరణి మంత్రిపిళ్లై యాన్‌కుడై గ్రామవాసి చిన్నయ్య అనే అతనికి కొంత డబ్బు అప్పుగా యిచ్చాడట. ఎన్నాళ్లయినా, ఎన్నిసార్లడిగినా, చిన్నయ్య ఆ డబ్బు తిరిగి యివ్వక పోడమేగాక, దబాయింపు ప్రారంభించాడట. దాంతో భరణి మంత్రికి వెర్రెత్తినట్టయి, చిన్నయ్య యింటికి వెళ్లి, వాళ్ల పెరట్లో కట్టున్న దూడను తనింటికి తెచ్చేసుకున్నాడట. ఆ తరువాత చిన్నయ్య వచ్చి పోట్లాటారంభించాడట. ఈ పోట్లాటలో భరణి మంత్రిని చిన్నయ్య కత్తితో పొడిచి చంపేశాడట... అప్పిచ్చువాడు???

## నిరుద్యోగికి విరక్తి

కృష్ణగిరికి చెందిన 40 ఏళ్ల నారాయణ్ అనే అతను కొన్నాళ్లు వో హోస్టలులోను, మరి కొన్నాళ్ళ



హోటలులోనూ, వంటపని చేసి, ఆనక నిరుద్యోగుల్లో చేరి, అక్కడుండడం ఇష్టంలేక పుదుచ్చేటలో వో చింత చెట్టుక వురి పోసుకుని, నిండు ప్రాణాలు తీసుకున్నాడట.

### చెప్పరాని చావు

కడపలో వో హోటలు యజమాని 50 ఏళ్ల లక్ష్మణ అయ్యర్ 23వ తేదీ మధ్యాహ్నం భోజనం చేస్తున్నవాడు చేస్తూ వున్నట్టే చని పోయాడట. ఆయనకు గుండెపోటు వున్నదట.

### వింత అయిశ్వర్యం

సికిందరాబాదులోని వో రైల్వే ఉద్యోగి యిల్లు అనుమానంమీద సి. బి. ఐ. వారు సోదాచేస్తే 20 లక్షలు విలువగల ధనకనక వస్తు వాహనాలు దొరికాయట. ఆయన భార్యపేర విజయవాడలో వో బ్యాంకు లాకర్లో దాచిన నగలుకూడా లాగేసుకున్నారట. మీ సంపాదనలో ఇంత ధనం నిలవేయడానికి తమరుఏనోమునోచారు అని సి.బి.ఐ.అడుగుతోందట.

### వజ్రం పుట్టిల్లు

కోహినూరు వజ్రం పుట్టినిల్లు, ఆంధ్రప్రదేశ్ అని, తనకే గనుక అధికారం వున్నట్లయితే సరాసరి బ్రిటనుకువెళ్లి వజ్రాన్ని అవలీలగా ఇండియా తెచ్చుండేసి వాణ్నని, కాని తాను కేవలం నిస్సహాయుడననీ, లోక్‌సభలో కేంద్ర విద్యాశాఖా మంత్రి ప్రొఫెసర్ నూరుల్ హసన్ అన్నారట. కోహినూరు వజ్రమునకు పుట్టిల్లు ఆంధ్రప్రదేశము ఆయిన ఎడల అత్తయిల్లు ఏది!

### దుర్భిక్ష నివారణ

భారత దేశంలోని రాష్ట్రాలలో 13 రాష్ట్రాల దుర్భిక్ష నివారణ చర్యల కోసం సుమారు413.89 కోట్ల రూపాయలైనా కావాల్సి వుంటుందట. ఒక్క ఉత్తర ప్రదేశ్ 160 కోట్లు కోరిందట—స్వాతంత్ర్యము వచ్చిన యీ పాతిక సంవత్సరాలలో స్వతంత్ర భారతదేశమున్ని విషయములందునూ పురోగమించెను... అన్నే వున్నది! ●



సీరియల్

# ఆకాశదీపాలు

పాలకోడేటి సత్యనారాయణరావు

### జరిగిన కథ

కాలేజీ ఎలక్షనులో పోటీచేస్తుంది శారద. మోహనరావును ప్రేమిస్తుంది. తను వ్రాసిన కథ చదవమని శారదకు ఇస్తుంది తల్లి. రామచంద్రయ్య కూతురు ఇందిర రిటైర్డ్ జడ్జిగారబ్బాయి రాంబాబును ప్రేమిస్తుంది ఇందిరతో స్నేహం తగ్గించుకోమని రాంబాబు తండ్రి చెప్తాడు. కానీ, అప్పటికే వాళ్ళిద్దరూ ఒకటయ్యారన్న సంగతి ఆయనకు తెలియదు. ఇందిర ఆ సంగతి సుందరికి తెలియచెయ్యాలని అనుకుంటుంది. తనలో చెలరేగే అలజడిని సుందరికి ఎలా చెప్పాలో తెలియలేదు ఇందిరకి.

## 6

ఇందిర ఏదీ నిశ్చయించుకోలేక పోయింది.

రాంబాబుకు ద్రోహం అనేది జరగలేదు గానీ, ఈ కృష్ణమూర్తికి ద్రోహం జరిగేటట్లే ఉంది. మనస్సును మమతలవైపు మళ్ళించుకోవాలో. మాంగల్యధారణకే ప్రయత్నించాలో అర్థంగాలేదు ఇందిరకు.

ఇందిర అనుకున్నదానికి విరుద్ధంగా, కృష్ణమూర్తి పెళ్ళికి వారంరోజులు ముందే వచ్చాడు. సుందరి నవ్వుతూ పలకరించింది కృష్ణమూర్తిని.

'పెళ్ళి వారంరోజులుంది గదరా ఇంకా!'

'వచ్చింది పెళ్ళికి కాదే, నీ కోసం, నిన్ను చూడాలని!' అన్నాడు కృష్ణమూర్తి.

సుందరి అదోలా చూసి, అడిగింది— 'నా కోసమేనా? లేకపోతే ఇందుకోసమా ?'

కృష్ణమూర్తి ఆశ్చర్యపోయాడు, ఇందిర విషయం సుందరే ప్రస్తావించటం జూసి, పక్కనేఉన్న ఇందిరకేసి చూసినా, అతనికేమీ అర్థంగాలేదు.

సుందరి ఆ సాయంత్రం అడిగింది ఇందిరను — కృష్ణమూర్తిని ఆ విషయమై అడిగావా అని: ఇందిర ఏమీ నిర్ణయించుకోలేదన్నా వినక, 'రేపు వాడిని నువ్వు కలుసుకుతీరాలి. వాడికీ విషయంలో ఇంకా ఇంటరెస్ట్ చావలేదు, తప్పక మాట్లాడి తీరాలి' అని ఖచ్చితంగ చెప్పేసింది.

ఇందిరకు ఏమి చెయ్యాలో పాలుపోలేదు.

కృష్ణమూర్తిని ఏమి అడగాలో, అతనికి ఏం చెప్పాలో ఆలోచించుకోకండానే అతన్ని కలుసుకోవాల్సి వచ్చింది — నవ్వుతూ, ఆ నవ్వులో ఆప్యాయతలను, అందాలను చిందిస్తూ — పలకరించాడు. అవీ ఇవీ చాలసేపే మాట్లాడారు.

చివరకు అతనే అడిగాడు: 'ఎందుకో కలుసుకోవాలన్నారుటగా!'

ఇందిర తత్తరపడింది. జీవితంలో ఒకానొక ముఖ్యమైన మలుపు తిరగాల్సి ఉంది. ఆ మలుపు ఇలా తిరగాల్సి వస్తుందని కలలోనైనా అనుకోలేదు. అయినా ... అయినా ఇక ఆలోచనలతో లాభంలేదు. అడిగెయ్యాలి అనుకొంది ఇందిర.

'...ఏమీ చెప్పారు కారేం...'

'అదే, అదే ... సుందరి ఏమీ చెప్పలేదా?—'

'సుందరా? చెప్పింది. గానీ నేనే నమ్మలేదు. అందుకే అడిగి తెలుసుకోవాలని వచ్చాను—'

'అది నిజమే- నేనే అడగమన్నాను-...'

'మీరా?—'

'ఔను, నేనే!...'

'తమాషాగ ఉంది — మీదగ్గరనుంచి ఇలాంటి దనలు నేను ఊహించలేదు —' నుంది వేళాకోళం ఆడుతోందేమో ననుకున్నాను ..'

'వేళాకోళంకాదు. నేనడగమంటేనే అడిగింది —'

కృష్ణమూర్తి ఏదీ మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు.

చాలసేపు పోయాక అడిగాడు— 'ఒక టడగనా ?'

'అడగండి.'

సంవత్సరం తర్వాత ఈ నిర్ణయానికెందుకు వచ్చారు ?'

ఇందిర నవ్వింది— 'సంవత్సరం క్రితం పరిస్థితులు వేరు. ఇపుడు వేరు...'

'అంటే ?...'

'అంటే, మనిషిని నిండా నిదినుభావాలకు కొత్తరూపం చేసి ఉండచ్చు. మారు, తెస్తేనో, వచ్చి ఉండొచ్చు, దానాలకు పరిస్థితులకు రాజీ కుదుర్చుకుంటూనే నిర్ణయాలు తీసుకొనేది-కాదా ?...

కృష్ణమూర్తి ఏమి అనలేదు.

'—ఏమి అనరేం ?—'

'ఆలోచిస్తున్నాను—' అన్నాడు కృష్ణమూర్తి.

'ఏమిటి? జవాబు—' ప్రశ్నించింది ఇందిర.

'జవాబు ఆలోచించాల్సిన పనిలేదు. నాకీ అదృష్టం ఇంతలా ఎలా వెతుక్కొచ్చింది అని?'

ఇందిర మనసు వికలమయిపోయింది— అతను తనను పెళ్లిచేసుకోవటం అదృష్టం అనుకొంటుంటే, తను అతన్ని మోసం చేయాలని యత్నించటం — ఛ, వింతగ దిగజారిపోవల్సి వస్తోంది! పోనీ; నిజం చెప్పేస్తే...

ఔను, ఈవేళ కాకపోతే, రేపయినా ఇది తెలిసేదే! దీన్ని బ్రహ్మదేవుడుకూడ దాచలేడు, ఇదివరమో, శాపమోగానీ!

నిజం చెప్పేస్తే, అపుడతను తన్ను స్వీకరించదలిస్తే, అదివేరు.

ఇలా నిజం దాచి, అబద్ధంతో అతన్ని వంచించి, ఆత్మను చంపుకొని ఎంత కాలం?— ఊహూ.—నిజం చెప్పెయ్యాలి—

'ఒకటి చెప్పాలి నేను...' ఇందిర ఆగిపోయింది.

'చెప్పండి...'

'మీరు నిర్ణయానికి రావటానికి మునుపు ఇది విని, తర్వాత నిర్ణయించుకొంటే మంచిది. చెప్పమంటారా?—' ఆగిపోయింది ఇందిర.

'చెప్పండి—మనసులో ఉన్నది చెప్పటం ధర్మం—' అన్నాడు కృష్ణమూర్తి.

భగవంతుణ్ణి ఒక్కసారి ప్రార్థించుకొంది— 'భగవాన్! నన్ను ఈ పరీక్షలో ఉత్తీర్ణురాలినే చెయ్యిస్వామీ! మోసం చెయ్యాలనేది నా ధ్యేయంకాదు. అవసరం కాదు! నిజాన్ని దాచడం దోషమని, ముఖ్యంగ జీవితం పంచుకోదలిచిన వ్యక్తి దగ్గిర దాచటం అమానుషమని నమ్ముతున్నాను—నన్ను రక్షించు స్వామీ!'

'చెప్పండి—' అన్నాడు కృష్ణమూర్తి.

ఇందిర అతనికేసి చూసి తల దించుకొంది. గొంతు సవరించుకొంది.

* * *

'అదీ సుందరీ జరిగిన సంగతి. నేననుకున్నది ఇంతలా ఎలా నిజమయిపోయిందా అని ఆశ్చర్యపోయాను నేను—'

సుందరి ఏమీ మాట్లాడలేదు. ఆమె కళ్లల్లో నీళ్లు సుడులు తిరిగాయి.

'ఛ, ఛ, కన్నీళ్లు కార్చకూడదే నువ్వు. కొత్త పెళ్లికూతురివి. కలకాలం నీ కళ్లు కళకళలాడాలేగానీ కన్నీళ్లతో నిండి బాధలు వ్యక్తపరచకూడదే...అయినా ఇదంతా నీకు నేను చెప్పాలిటే, ఏదో నా పిచ్చిగాని...'

'ఇందూ; నామాట వింటావా?—'

'ఆ, నీమాట వినేగదా మీ అన్నయ్యను కలుసుకొన్నది...'

'అదికాదే—'

'ఏదయినా సరే నువ్వు చెప్పు, నేను వినకపోతే అప్పుడడుగు...'

'నీ చేత్తోటే ఒక గుక్కెడు విషం



ఇచ్చేస్తే సరిపోను గదే..'

'ఎవరికి? మీ అన్నయ్యకా?'

'కాదే; నాకు — ఈ బాధంతా వాడి కాదూ? నావల్లకాదూ?—'

'ఛీ, ఛీ...ఇలాంటివే వద్దు. ఒకవిధంగా నాకిది మేలే చేసిందే నీ కర్థంగాదు కానీ! బ్రతకాలనే కాంక్ష పెరిగిందే నాలో! కానీ మీ అన్నయ్య అనుకొన్నట్లు కాదే నే బతికేది — ధైర్యంగా, రాంబాబు భార్యగా బతుకుతానే — రాంబాబు పారిపోయాడేమో గానీ నేను పారిపోలేను. నాది అంత బాధ్యత లేని బతుకు కాకూడదు. ఎలా బతకలేనో, బతికి చూపిస్తాను. అని అందుకే అంటున్నాను; మీ అన్నయ్య నాకు మేలే చేశాడని...'

'వాడా? మేలు చేశాడా?—'

'ఊఁ—'

'నీకు వేరేలా వస్తోందే ఆమాట అనడానికి? కాలుజారిన ఆడది అనే భావనే గదే వాణ్ణలా చేసింది? అయినా తప్పంతా వాడే ననుకో — వాడు నిన్నేదో ప్రేమిస్తున్నాడనే అనుకొన్నానుగానీ, కామిస్తున్నాడని అనుకోలేదు నేను. అలా అయితే ఇలా నిన్నొక్కదాన్ని పంపేదాన్నేకాను నేను. అయినా వాడసలు ఇంటికి రానీ...'

'ఇదిగో, నువ్వు 'కృష్ణ'నేమీ అనకు — అతని తప్పేమీలేదు. జీవితంలో ఆడదొకట్రి కాలుజారింది కనిపిస్తే వదిలేరకం కాదు. ఈనాటి మగవాళ్ళు. ఆ వేలాది మందిలో ఇతనొకడు. అంతే, అంతకన్న ఇంకేం లేదు—'

'సారీ ఇందూ...'

'ఇదిగో, ఇలాటి మాటలే వద్దనేది. ఇందులో సారీకి, క్షమించడానికి ఏముంది గనుక! అదలా జరగాలని ఉంది జరిగిపోయింది. అయినా ఈ క్షమాపణ నువ్వు కోరుకోవాలా?— నీ ప్రోత్సాహంవల్ల మీ అన్నయ్యను చేరాను గనుక నీకీ ప్రోగ్రెస్ కార్డు చూపించటం. లేకపోతే ఈ అవసరమే లేదుగదా!...'

సుందరి ఏమీ మాట్లాడలేదు. ఆమె కళ్ళు బాధను వర్షిస్తున్నాయి. ఆ కళ్ళల్లో 'నావల్లకదా నీకింత కష్టం కలిగింది' అనే భావం ప్రస్ఫుటమౌతోంది.

ఇందిర నవ్వేసింది. క్షణం ఆగి అంది —'నువ్వేం బాధపడకు సుందరీ! జరిగేది ఏదైనా మంచికే జరుగుతోందనుకుంటే సరిపోతుంది... నవ్వుతావేమే రాస్కెల్?—' సాధ్యమైనంత స్వాభావికంగ అవడానికి ప్రయత్నించింది ఇందిర.

పేలవంగ నవ్వింది సుందరి 'ఇంకా, ఒకటడుగుతాను, నిజం చెబుతావా?'

'ఊఁ'

'నీకింతధైర్యం ఎలా వచ్చిందే?— నాకెంత ఆశ్చర్యంగనో ఉంది..

'క్షణంసేపు ఆలోచించి చూస్తుంటే నాకూ అనిపిస్తోంది ఇంతధైర్యం ఎక్కడిదా అని? కానీ నాకు జవాబు తెలుసు—ఒకసారి దెబ్బతిన్నదాన్ని. ధైర్యం కాదది, బతకాలనే ఆశ కలిపిస్తున్న మొండిధైర్యం. అంతే! అంతకన్న...'

'ఇంకేమీ లేదంటావ్—సరే, ఇంకొక్క మాట—'

'అడుగు;—'

'అడుగుతాను...నేనంటే నీకు చింతో కోపంగ ఉందిగదూ?—'

'నువ్వంటేనా?' ఫకాలున నవ్వింది ఇందిర. ఉలికిపడింది సుందరి. 'నువ్వంటే నాకిష్టమే! ఎంత ఇష్టమంటే ప్రాణాన్ని తీసి నీకలా ఇచ్చేయమంటే, క్షణం చాలు నాకు! ఎందుకని అడుగుతావా? బతకాలనే ఆశకల్పించావే! ఈ సంఘటనే నా జీవితంలో లేకపోతే కథ మరోలా ఉండేదేమోనే!...'

'అంటే?—' అర్థం కాలేదన్నట్లు అడిగింది సుందరి.

'అంటే ఏముంది?— జీవితంలో ఏయే క్షణంలో ఏయే మలుపు తిరుగుతుందో, ఏ మలుపుకు ఎలా రియాక్టవ్వాలో అర్థమవుతుందే! 'జీవితం అంటే ఇది. ఈ జీవిత సమరంలో ఇలా నడుచుకొంటేనేగానీ నువ్వు మనలేవు' అని నాకు ఈ క్షణంలో ఒక పాఠం నేర్పిన సంఘటన ఇదే! ఈ సంఘటన నేర్పిన పాఠం నేను తప్పకుండా నేర్చుకొని తీరాలంటే ఒకటేమార్గం కనిపిస్తోంది—'

'ఏమిటే అది?—' ఆతృతగ అడిగింది సుందరి.

'వెంకటేశ్వర్లుగారు చెప్పింది వినటం...'

'ఎవరూ? రాంబాబు తండ్రి?—'

'అవును. ఇంకా రాంబాబు తండ్రేమిటే? ఇప్పుడాయనకూ మామగారు. అంటే భర్త ఫాదర్.'

'ఏం చెప్పారేం?—'

'మంచికోరి, మంచిసలహా ఇచ్చారు. ఇల్లువదలి వెళ్ళిపొమ్మన్నారు...'

'విన్నా?—'

'లేకపోతే విన్నా?—'

'ఒసేయ్, పరిహాసాలతో చంపేసెయ్, సరేనా?—' కోపంగ అంది సుందరి.

'క్షమించవే! — ఇల్లువదలి వెళ్ళమంటే పారిపొమ్మనిగాదు. ఈ ఊరువదలి, బిడ్డను



కనేదాకా వేరే ఊళ్లో ఉండమని సలహా ఇచ్చారు—'

'ఉండేటట్లయితే పరిష్కారమయిపోయి నట్లేనా?—'

'పరిష్కారమవుతుందని కాదు; ఒక విధంగ పరిష్కరిద్దామని. పదిమంది నోళ్లల్లో నా పేరు, రాంబాబుపేరు నలగ కుండా ఉండాలనీ, మా బిడ్డకు చెడ్డపేరు రాకూడదనే సదభిప్రాయంతో...'

'చాల్లే—బోడిసలహా ఇచ్చారు.'

'అలా తీసిపారెయ్యకు మరి! ఆయన చెప్పింది నిజం. అదే ఉత్తమ పరిష్కారం కూడా అనే అనిపిస్తోంది నాకు.'

'అయితే ఇంకేం? మామగారి మాట జవదాటమని నేనెవర్ని చెప్పటానికి?'

'అలగకు — నీ సలహా లేనిదే ఏపనీ చెయ్యను—'

'మరి ఇదెవ్వరు చెయ్యమన్నారు?—'

'ఏది?—'

'అదే, రాంబాబుతో...'

'నువ్వు కొత్త పెళ్లికూతురువు. నీకు సిగ్గు అనే పదార్థంగురించి కొంచెం అయినా తెలుసా?—'

'నువ్వు సిగ్గుపడేకాబోలు ఈ పని చేసింది...'

'షటప్. ఇంతకూ...'

'కొంచెం ఆలోచించుకొని చెబుతాను: సరేనా?—'

'కానీ ఒకటే! మీ అన్నయ్యను ఈ విషయంలో ఏమీ అడగకు—'

## ఆకాశ దీపాలు

సుందరి ఏమనుకుందోగానీ 'సరే'నంది. వారంరోజుల తర్వాత ఇందిర ఆ ఊరు వదిలింది—ఉద్యోగం వచ్చిందనే విషతో.

* * *

'డియర్ సుందరీ—

ఆరునెలల తదనంతరం రాస్తున్న ఉత్తరం ఇది. ఖచ్చితంగ మూడునెలల కిందటొక ఉత్తరం రాశాను, దానికి జవాబు అందుకొన్నాను. అలాగే దీనికీ జవాబు అందుకొంటే చాలనే నా కోరిక.

క్షణం ఆలోచించి, వెనుదిరిగి చూసు కొంటే; ఎన్నో విశేషాలు కనిపిస్తున్నాయి నాకు. ఈ మూడునెలలలోనే — ఉద్యోగం అనే పేరుతోనే ఈ ఊరు చేరినా ఉద్యోగం సద్యోగం ఏమీలేకనే మూడునెలలు గడిచాక, అనుకోకుండా ఉద్యోగం వచ్చింది నాకు— ఉద్యోగం రాగానే తెలియపర్చాలనే అను కొన్నాను కానీ బద్ధకం—అంతే, బద్ధకం వల్లనే రాయలేక పోయాను – అయినా ఉద్యోగం ఎలా వచ్చిందో చెప్పనేలేదుగదూ! —మా మామగారు; ఔను; రాంబాబు నాన్నగారి ప్రయత్నంవల్ల. ఇంటర్వ్యూలో నన్నడిగినవి రెండే ప్రశ్నలు — మొదటిది నీపేరేమిటని! రెండోది వెంకటేశ్వర్లుగారు నీకు చుట్టమా? అని. రెండో ప్రశ్నకు జవాబు సరిగా నాకే తెలీదు. ఇంక వాళ్ల కేమని చెబుతాను?— అయినా ఎందుకో 'ఊ' అన్నాను. 'అయితే రేపొచ్చి ఉద్యోగంలో చేరండి' అన్నారు.

చేరిపోయాను—ఇపుడు నాకు నెలకు రెండువందల యాభైరూపాయ లొస్తు న్నాయి. కష్టార్జితం! చాల తృప్తిగ ఉంది నాకు ఇలా బతుకుతోంటే! నాకు, నాన్నగారికి బాగ సరిపోతాయి. అమ్మకు ఇక్కడనుంచి నెలనెలా యాభైరూపాయలు పంపిస్తున్నాను. అమ్మా అంటే కంట్లోంచి నీళ్లొస్తున్నాయ్!— నాలాంటి కూతురు ఏతల్లికి వద్దు!!

—అయినా నాగురించి రాంబాబు మర్చి పోయినా, రాంబాబు తండ్రి మర్చిపోలేక పోవడమే ఆశ్చర్యంగ ఉందిగదూ!— అయినా రాంబాబుది ఉద్రేకం. ఉద్రేకంతో ఆవే శంతో ఏంచేస్తున్నాడో స్పష్టంగ గ్రహించ గలిగేస్థోమత అతనిలోలేదు. వెంకటేశ్వర్లో? —అలాకాదు. అతను రిటైర్డ్ జడ్జి: తను చేసేపనివల్ల మంచి జరుగుతుందో, చెడు జరుగుతుందో ఒకటికి రెండుసార్లు ఆలోచించి నిర్ణయం తీసుకొనే స్వభావం అతనిది—అది అతనికి వృత్తి నేర్పిన విద్య; అందుకే నన్నంత త్వరలో మర్చిపోలేక పోయాడు—కృతఘ్నురాలిని—కనీసం ఉత్తరం అయినా రాయలేదు నేను. రాయాలి!

ఇంక ఆఫీసు విశేషాలు: మొదటి వారంరోజులూ కొంచెం కొత్తగా ఉన్నా; ఇపుడు కొంచెం పర్వాలేదనిపిస్తోంది. శారద అనే కొలీగ్‌తో మంచిస్నేహం ఏర్పడింది: నాకు, నీవు లేనిలోటు ఆవిడవల్ల తీరుతోం దనుకో! చాల సున్నితమైన మనిషి: ఏదైనాఒకటి అంటే, అది ఎంత తేలికయిన విషయంగ మనకు కనిపించినా, ఆమెను కొంచెం బాధిస్తే చాలు; కళ్లమ్మట నీళ్లు నిండుకొంటాయి. బహుశా ఇలాంటివాళ్లను చూసే, ఆడవాళ్ల నెత్తిమీద నీటికుండ ఉందన్నది!!— తర్వాత. పాపం; శారద నాన్నగారికి పిచ్చి. ఆ పిచ్చితండ్రితో ఎలా వేగుతుందో ఏమో అర్థంగాదు నాకు!!

శారదకు పూర్తి వ్యతిరేకమైన మన స్తత్వం ఉన్నవ్యక్తి రామారావు. ఉట్టి భోళామనిషి. మొదటిరోజునే నాదగ్గరొచ్చి ఏమడిగాడో తెలుసా?— 'మీరేమీ అనుకో కండి, మీరు మిస్ ఇందిరా? మిసెస్ ఇందిరా?' అని. భయపడ్డాను నేను ఇతనికేమైనా తెలుసాననని. అయినా జవా బిచ్చాను—'మిసెస్ ఇందిరే'నని! 'ఎందు



ఉడిగావంటే 'తోసెండెన్స్‌లో' మీరేదు రాయాలి, అందుకోసం—పైగా మీమెళ్ళో మంగళసూత్రం ఉన్నట్టు లేదు—'అతనన్నది నిజమే, నామెడలో మంగళసూత్రం లేదు, నేను కుమారినా? శ్రీమతినా?—

క్షణం ఆలోచించి, గోడకట్టినట్టు చెప్పాను—'అవును, మాది రిజిష్టర్డ్ మారేజీ! వారికిలాంటివన్నీ నచ్చవు; ఈ సనాతన ధర్మాలూ, ఈ మాంగల్యం, పెళ్ళి అంటూ అనవసరపు ఖర్చు అంటారు. సింపుల్‌గ రిజిష్టర్డ్ మారేజీ—' ఇంత ఎందుకు మాట్లాడనో ఈవేళ ఆలోచిస్తుంటే తెలుస్తోంది. నాది గిల్టీ కాన్షస్! చేసిన తప్పును కప్పిపుచ్చుకొనేందుకు విఫల ప్రయత్నం. అంతే!! మొత్తానికి భోళా శంకరం నమ్మేశాడు.

తర్వాత పడిపడి నవ్వుకొన్నాను — నా భర్త కట్టని తాళి గురించి, నా భర్తకున్న ఆదర్శ భావాల గురించి తలుచుకొని.

ఇంకొక ప్రశ్నకు జవాబుకూడా ఆలోచించుకొన్నను ఆరోజు రాత్రే — 'మీ ఆయన ఏరి?' అంటే— 'హయ్యర్ ఎడ్యుకేషన్‌కి స్టేట్స్ వెళ్ళారు' అయినా ఆ ప్రశ్న ఇంకా ఎవరూ వేయలేదు.

చివర్న రాస్తున్నా చాల ముఖ్యమైనది ఇదే— నీ దాంపత్య జీవితం ఎలా ఉంది? పూవులో తావిలా, చంద్రునిలో వెన్నెలలా మీ ఆయనలో నువ్వు కలిసిపోయావా? లేకా?— లేదా అని అడగకూడదూ?— ఏదైనా విశేషముంటే రాయి; రాయడం కాదు, ఇక్కడకే వచ్చెయ్ పురుడుకు ఇంత పిసరు లేకుండా ఎలా రాస్తున్నా ననుకుంటున్నావా? అదంతే!!

అమ్మకు ఈ మధ్య ఒంట్లో బాగుండటం లేదు. ఎందుకని అడగకు. కారణం ఊహించుకో. చేతికి అంది రావాల్సిన కూతురు తలవంపుకొనేపని చేయటమే!— అఫ్‌కోర్సు, ఇది అమ్మ ఊహమాత్రమే, నేనుమాత్రం తలవంపుకొనేపని చేసానని అనుకోను.

విశేషాలు ఇంకేమీ లేవు.

అమ్మను చూడాలని ఉంది. కాని వీలుకాదని తెలుసు.

వెంటనే ఉత్తరం రాస్తావుగదూ సుందరీ!—

నాన్నగారు దగ్గరే ఉన్నా; ఎంతో దూరంలో ఉన్నట్టుగ ఉంది నా ప్రాణానికి. ఏ కష్టమైనా నష్టమైనా నాకూడ చెప్పుకో

లేని పరిస్థితి వచ్చింది మా ఇద్దరిమధ్య. ఈ నీలితెరలు, కాదుకాదు, ఈ ఇనుపతెరలు ఏనాడు తొలగిపోయి మా ఇద్దరి మధ్య తండ్రీకూతుళ్ల అనుబంధం ఏర్పడుతుందో ఊహించలేకపోతున్నాను— బహుశా మా ఇద్దరిమధ్య కొంత బాంధవ్య పునరుద్ధరణ జరిగేది నాకు పుట్టబోయే పాప వలనే అనుకుంటా! — పుట్టబోయే పాప నాకేదో మేలు చేయాలనుకోవడం స్వార్థమే, కాదనను!!

క్షమించు, మనసెంతో బాధపడుతున్నా ఈ విషయం రాయక తప్పటంలేదు — మొన్న నువ్వు రాసిన ఉత్తరంలో రాంబాబు కనిపించాడని రాశావు. ఏ స్థితిలో? ఎక్కడ? ఎలా ఉన్నాడు? — నాగురించి వివరాలు ఏమైనా అడిగాడా? లేదా? వీలైతే విశేషాన్నీ రాయి. వీలైతే కాదు, తప్పకుండా రాయి. వెళ్ళి కలుసుకోవాలి. ఈ అరణ్యవాసం తప్పి, అంతఃపురనివాసం కాకపోయినా, కనీసం తల్లిదండ్రుల దగ్గరగ నివసించే అవకాశం లభిస్తుంది. అందుకోసం అతని సహకారం తప్పనిసరి.

ఉంటా మరి, శ్రమ అయినా సరే, రాంబాబు గురించి తెలుసుకో.

—నీ
ఇందిర.

(ఇంకా ఉంది)

# మహాత్మ్యాల ప్రయోజనం



బులుసు వేంకటరమణయ్య —— ధర్మపథం

మన దేశంలో ఎన్నో పుణ్యక్షేత్రాలు ఉన్నవి. ఎన్నో పవిత్రతీర్థాలు ఉన్నాయి. ఆ యా క్షేత్రాలలోని దేవతలను దర్శించడంవల్లా, ఆ యా తీర్థాలలో స్నానం చెయ్యడంవల్లా ఎంతో పుణ్యం లభిస్తుందనీ, పాపాలు నశిస్తాయనీ, వాటి వాటి మాహాత్మ్యాలలో చెప్పబడుతూ ఉంటుంది.

పాండురంగ మహాత్మ్యం చూస్తే తెలుస్తుంది. నిగమశర్మ దుర్మార్గుడై, దొంగతనంతోగడిదేరి. జారుడై, మద్యమాంసాలకు అలవాటుపడి, తలిదండ్రులయెడ ద్రోహిగా ప్రవర్తించి. జాతిభ్రష్టుడయి లెక్కలేని పాపాలు చేశాడు. అయినా పండరిపురంలోని నరసింహక్షేత్రం దగ్గర ప్రాణాలు విడిచినంతమాత్రాన, ఆ పాపాలన్నీ పోయి; అతనికి దేవత్వం లభించింది. అంతే కాదు. అతడు వైకుంఠంలో విష్ణుదేవుని పరిచారకులలో ముఖ్యుడయినాడు.

సుశర్మ అనే బోయ సంగతీ ఇటువంటిదే! అతడు దారిదోపిళ్ళు చేసేవాడు. దయాదాక్షిణ్యాలు లేకుండా ఎందర్నో హత్య చేశాడు. చంపిన జంతువులకు లెక్కలేదు. అట్టివాడు పద్మతీర్థానికి అనుకోకుండానే వెళ్ళి, అందులో స్నానం చేసి. నీరు తాగిన వెంటనే అతనికి దివ్యత్వం లభించింది.

ఇలాంటి వృత్తాంతాలు వింటే— కొందరికి— ఎన్ని పాపాలు చేసినా తప్పు లేదనీ, ఒక్కసారి ఏ పుణ్యస్థలానికో, ఏ పవిత్ర తీర్థానికో వెళ్ళి దేవుణ్ణి దర్శించుకున్నా, తీర్థంలో స్నానమాడితే— ఆ పాపాలన్నీ నశిస్తాయనీ తోచవచ్చు. కాని, అలా భ్రాంతి పడడం చాలా పొరపాటు. ఆ యా ప్రదేశాల ప్రాశస్త్యాన్ని తెలపడానికి అట్టి కథలు చెప్పబడతాయిగాని, వాస్తవానికి— చేసిన పాపం ఎన్నడూ పోదు. దాన్ని అనుభవించవలసినదే!

ఆ యా ప్రదేశాలకు ఇలాంటి మహిమలు ఉన్నట్టు చెప్పితే ప్రజలు తప్పకుండా వెళ్తారని — ప్రజలను ఆకర్షించడానికే ఇట్టివి మాహాత్మ్యాలకు ఎక్కించబడ్డాయని మనం తెలుసుకోవాలి.

పుణ్యక్షేత్రాలకు వెళ్ళినంతమాత్రాన, పుణ్యతీర్థాల్లో స్నానపానాలు చేసినమాత్రాన పాపాలు నశిస్తాయని అనుకోరాదు.

# వారఫలం

**22-9-1972 శుక్రవారం మొదలు**

**28-9-1972 గురువారం వరకు**

**మేషం :** లాభం. రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారంమధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం.** వృత్తిలో ఆదాయం బాగుంటుంది, నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూలత లభిస్తుంది. సాటివారిలో గౌరవం బాగుంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిధునం** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండకపోవచ్చును

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :** వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**వృశ్చికం :** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**ధనుస్సు:** మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాలో మీ కృషి రాణిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు—బంధు మిత్రులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం :** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం :** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**మీనం :** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

—మహేష్ ●

# ఓరిమిగలగాడిదకు భారం తప్పదు!



కె. రామలక్ష్మి

'పనిగాడిదలుంటే కూచుని అలిసిపోయే వాళ్ళుంటారు' అనేది మా అత్తయ్య—అది అక్షరాలా నిజం అనిపిస్తుంది నాకు. మనకు తెలిసిన వాళ్ళనే కొంచెం పరీక్షగా చూడండి—భూతద్దం కూడా అక్కరలేదు. కొందరు—కొందరికంటె ఎక్కువ పని చేస్తూ వుంటారు. ఎందుకు చేస్తారు? ఇతరులకంటే దయ, జాలి, మంచితనం ఎక్కువ వుండడంచేత, నిజాయితీ, చేయాలన్న వుత్సాహం వుండడంచేత. దానికి ఫలితం ఏమిటి? చేయించుకునేవాళ్ళు చిరునవ్వు నవ్వుతూ కబుర్లు మటుకు చెప్తూ హాయిగా వుంటారు — అంతేకాదు — చేయని పనికి అభినందనలు హాయిగా పంచుకుంటారు కూడా.

పనిచేయనివాళ్ళదే అట్టహాసం. వారి కృషి అంతా కబుర్లలోనే వుంటుంది. వీళ్ళే ఎక్కువ నిక్కి నీలిగి, చేయవలసిన పని గురించీ, తాము చేసిన దాన్ని గురించీ—తెగ వాగుతారు. ఎంత మాట్లాడుతారంటే — అసలు పని జరగనంత! అంత గట్టిగా చెప్తూ వుండడంచేత—చుట్టుపక్కల వారంతా అయ్యో పాపం. అంటూ సానుభూతి ప్రదర్శించి వారి కీర్తి పెంచుతారు. ఈలోగా, ఓరిమిగల వాడే గాడిద నెమ్మదిగా బరువు మోస్తూ పని ముగిస్తుంది. ఈ సంగతి ఎవరూ చూడరు. ఎవరికీ తెలియదు. ఎందుకంటే—పని చేసేవాళ్ళకి దాన్నిగురించి బ్రహ్మాండంగా చెప్పే టైమెక్కడ?!

ఇలా చేయించి ఘనత కొట్టేసేవాళ్ళు చాలా రకాలుంటారు. ఆఫీసుల్లో టైపిస్టులు, హెడ్ గుమాస్తాలు ఇత్యాదులు. చాకిరీ అంతా మెత్తనివాళ్ళ నెత్తిన రుద్ది—తీరి కూర్చుని అలిసిపోతూ వుంటారు. ఎవరేనా ఏపని మీదేనా వెడితే—మాట్లాడ్డానికి కూడా తెరిపిలేనట్టు బాధపడిపోతూంటారు.

ఈ ఓర్పుకి బలి అయిపోయేది ఎక్కువగా అమ్మమ్మలు! అంటుందో స్నేహితురాలు. మనవలంటే నిజంగా ప్రాణమే. అయితే మటుకు? ఓ వయస్సు వచ్చాక ఎంతకని చాకిరీ చెయ్యగల్గుతారు! 'అమ్మమ్మ వుంది' అంటూ హాయిగా ఉద్యోగానికి వెళ్ళిపోయిందో చిట్టితల్లి... కని పెంచి పిల్లలు పెద్దవాళ్ళయాక హాయిగా వుందామనే అమ్మమ్మలకి చిన్న పిల్లలు మళ్ళీ తయారు! ముద్దుపేర వాళ్ళని ముసలాళ్ళమీదికి తోసేసి హాయిగా వుంటారు—తల్లీ తండ్రీ. 'మనవడితో హాయిగా కాలక్షేపం చేస్తూంది. నేనూ మావారూ సినిమాకెళ్ళి వస్తాం' అంటుంది గారాబుపట్టి. ఓ చంటాణ్ణి చూడ్డం మహా సులువైనట్టు! పాపం అమ్మమ్మ ఏం చేస్తుంది? ఏమంటుంది? యిదివరలో ఈ ప్రోసెస్ అంతా అయిపోయింది. మళ్ళీ ప్రారంభం కాబోలు నాకు, అనుకుని ఊరుకుంటుంది. పోనీ అంటే అమ్మమ్మ లీ రోజుల్లో వయస్సు మళ్ళినవాళ్ళు కూడా వుండడంలేదు. ఇలాగే నా స్నేహితురాలొకామె 'యింకా నలభై అయిదు దాటకుండానే అమ్మమ్మ అయింది. మనవడి పనితో అస్సలు ఓ గంటకూడా తెరిపి లేకుండా వుంటూంటే—'ఓసారి కోడలికి చెప్పకూడదా?' అన్నాను. 'బాగుండదు. నాకు పిల్లలంటే యిష్టం లేదనుకుంటుంది!' అంది గబుక్కున. ఈ మొహమాటంమీదే ఆధారపడి వుంటాయి యీ ఫ్రీ సర్వీసులన్నీ అనుకున్నాను.

ఈ ఓరిమిగల గాడిదల పోటీలో—మన ఆడవారిదే పైచేయి. తల్లినే తీసుకోండి. పిల్లలకు హాజరు జవాబు పలుకుతూ, కావలసినవన్నీ చేసిపెడుతూ, వారి పుస్తకాలు, బట్టలు సర్ది పెడుతూ ... అన్నీ వాళ్ళపని చేస్తుంది. కాని ఈ రకంగా వారికి సర్వం చేసిపెట్టడంవల్ల మనని ఆదరిస్తారనుకోవడం శుద్ధ పొరపాటు. తరవాత తరవాత—యీ డిపెండెంటు నేచరుకే—మనని తప్పు పడతారు— 'అలా పెంచావు!' అంటూ.

ఓపిగ్గా పని చేసినందుకు క్షణంలో మెప్పు లభించినా చివరికి ఎదురు దెబ్బ తగిలేది మనకే...సభలూ, మీటింగులూ నడిపేవాళ్ళని చూడండి. చాకిరీ అంతా చేసేది ఒకరు. పొగడ్త పొందేది ఒకరు. కాని ఏ కొంచెం బెడిసికొట్టినా — దానికి బాధ్యత వహించేది మళ్ళీ ఎవరు? చాకిరీ చేసినవాళ్ళే. ముందుకొచ్చి భుజం కాస్తే 'చూశావా? పేరుకోసం పాకులాడుతోంది' అంటారు. ఏదేనా పొరపాటు జరిగిందా 'ఎప్పుడూ యింతే తగుదునమ్మా అంటూ సిద్ధం అవడం! అభాసు చేయడం' అంటారు. అందుకే ఎందుకు ఓరిమి కల్గి గాడిదబరువు మోయడానికి సిద్ధపడాలి? అంటాను? కాని ఏం లాభం? పనిచేసి మాట పడేవాళ్ళు వుంటారు. పని చేయకుండా కీర్తి అందుకునేవాళ్ళూ వుంటారు. మానవనైజం అది ●




ఎడిటర్ గార్కి,

తమరు నా కథ ప్రచురించలేమని విచారిస్తూ వ్రాసిన ఉత్తరం లేటుగానైనా యీ రోజే అందినది. చాల సంతోషం—

ఒకరి విచారము మరొకరికి సంతోష దాయకమే గదా! ఇంతవరకూ నేను మీకు నలభయిరెండు కథలు పంపియున్నాను (తిరిగి పంపుటకు స్టాంపులు పెట్టకుండానే) మీ వద్దనుంచి నలభయిఒక్క కథలకు కార్డులు వచ్చినవి. మిగతాదానికిగూడా మీరు పంపియే ఉందురు... కాని నాకు అందలేదు.

నాకు తెల్సినంతవరకూ మీరు నలభై ఒక్కసారి నా కథలను గురించి విచారించి ఉంటారు.

అన్నిసార్లూ నేను సంతోషించాను—

నలభై రెండోసారి మీరు విచారించే ఉంటారు—

పోస్టల్ వాళ్ళధర్మమా అని నాకా అవకాశం (సంతోషించే) యీ రోజు వరకు కలగలేదు—

కనుక దాని తాలూకు ఓ 'సర్టిఫైడ్ కాపీ' ఒకటి పంపమని కోరుచున్నాను,

అది పంపే నిమిత్తం...స్టాంపులతికించి నా స్వంత అడ్రసు వ్రాసిన కవరును యిందుతో పంపుచున్నాను—

మీరు తప్పక పంపగలరు—

మీరు పంపితే...ఎనభైతొమ్మిది కథలకు మీరు విచారించినంతగా... నేను సంతోషిస్తాను—

దీనితోపాటు నా నలభై మూడవకథ 'తిరిగొచ్చే కథ'ను కూడా పంపుచున్నాను—

ఇది త్రిప్పిపంపారో యీ జన్మలో మరి మీకు కథలు పంపనని వ్రాయడానికి గర్విస్తున్నాను—

ఎందుకంటారేమో ?

సాధారణంగా మీ పత్రిక ఏలాటి కథలు ప్రచురిస్తుందో గత పదిహేడు నెలల పత్రికలు క్షుణ్ణంగా చదివాను—

అందులో...

హిస్టరీ కథలు ... హిస్టీరియా కథలు..

మిస్టరీ కథలు ... మినిష్టరీ కథలు...

బాల కథలు ... జబ్బాల కథలు...

బారు కథలు ... దర్బారు కథలు...

వాటితో పాటు 'డ్రాటు' కథలు ..

ప్లీడరీకథలే గాక...అమ్మాయిల్నబ్బాయిలూ.. అబ్బాయిల్నమ్మాయిలూ గిచ్చుకోవటం, హృదయాలు పుచ్చుకోవటంలాటి కథలు గూడా ప్రచురింపబడ్డాయి.

యీ కథలన్నీ చదివేక మీ 'టేస్టు'ను కొంత గ్రహించి...నా నలభైమూడో కథలో,

మీ పదిహేడు మాసాల పత్రికల్లోని సారాంశాన్ని

గుప్పించి

చొప్పించి

మిమ్మల్నొప్పించాలని చేయాల్సిన ప్రయత్నమంతా చేశాను—

క్లబ్ డాన్సులు

ప్లీడరు పిత్తలాటకాలు...

టి. బి. పేషంట్లూ...

ముష్టివాళ్ళూ...

ముదనష్టపువాళ్ళూ...

ఛాందసులూ ... చచ్చుపీనుగులూ

పనికిరానివాళ్ళూ ... దేశనాయకులూ...

రోగగ్రస్తులు... రోమేన్స్‌గ్రస్తులూ...

హిప్పీగుంటలు ... గుంటళ్ళు...

వగైరా.. గైరా...అన్నిట్నీ...అందర్నీ...

కథలోయిరికించి.. రసపోషణ..పాత్రపోషణ..

సమపాళ్ళలో... కుదిరి చమేలా పరికించి...

## ఇంకోసారి ...

యీ కథేసుకోపోతారా ? ఆయ్! అని పళ్లికలించి పదేపదే వ్రాసిందంతా తిలకించి మరీ కవరంటించాను (అగ్గిపుల్లతోకాదు.. తుమ్మ బంకతో! స్ట్రాంగుగా ఉంటుందని)

కేవలం నా 'టేస్ట్'నే గాకుండా... అన్ని రకాల పాఠకుల రుచుల్ని ... అభిరుచుల్నీ... జీర్ణించుకుని...తాత చదివినా ... తనయుడు చదివినా...అమ్మాయి చదివినా...అవ్వచదివినా ఆనందించేలా రకరకాల పాత్రల్ని సృష్టించాను—

నవ్వే వాళ్ళని ఏడిపించటం ఎలాగూ నైజం కనుక అందమైన అమ్మాయిలచేత సీరియస్ డైలాగులు చెప్పించి ... కన్నీటిని ధారాప్రవాహంగా కురిసేలా హృదయాలకు హత్తుకుపోయేలాటి సంఘటల్ని సృష్టించి ఆ రకం పాఠకుల అభిమానాన్నిగూడా చూరగొనాలని శక్తి వంచన లేకుండా ప్రయత్నం చేశాను—

యిక యేడ్చేవాళ్ళనుకూడా యెంతో కొంత నవ్వించటమో .... ఓదార్చటమో... మానవత్వం అనిపించుకుంటుంది కనుక... వీట్ని కుండపోతగా కురిపించాను—

అఫ్‌కోర్స్!

కొందరేడ్చేవాళ్ళున్నారూ అంటే ఎన్ని విశ్లేసినా వాళ్ళకు నవ్వెలా వస్తుంది నా పిచ్చిగాని ?

ఆకలి...

కాళ్లల్లో నిస్సత్తువ...! బతుకుభయం...! రోగపీడితులు...

పూట గడవనివాళ్ళు...

కొడిగట్టిన ప్రాణంతో...

కొన ఊపిరితో...

చావలేక బ్రతికేవాళ్ళు...

చావురాక చస్తున్నవాళ్ళు...

యిలాటి వాళ్ళను నావీట్లు యేం చేయగలవ్? పోతే...కడుపుమండి యేడ్చేవాళ్ళు...

ఎదుటివాడు తనకన్న బాగుపడి పోతున్నాడు—

ఎదుటివాడు తనకంటె ఎత్తుకు వెళ్లిపోతున్నాడు...'

ఎదుటివాడి పరువో... మర్యాదో..దిబ్బో.. దిరిగురడమో ... తనకంటే పెరిగిపోతున్నాడు...

నా వీట్లకు సంబరపడతాడు — ఎదుటివాడి కన్నీయించుకుంటా.

— అందుకే...



# తల నొప్పా?
# అనాసిన్

## నొప్పి నివారణకు మేలైనది. ఎందువలనంటే అది బలీయమైనది మరియు సురక్షితమైనది.



ఒలింపియన్ ఫుట్ బాల్ ఆటగాడు నెవిల్ డిసౌజా అనాసిన్ వాడకందారు. 'నేను ఎల్లప్పుడూ అనాసిన్ దగ్గర ఉంచుకుంటాను', అని అతను అంటాడు.

***బలీయమైనది*** ఎందువలనంటే ప్రపంచమంతటా ఎక్కువ మంది డాక్టర్లు సిఫారసు జేసే బాధా నివారక పదార్థాలు అనాసిన్ ఎక్కువగా కలిగియున్నది. అందువలననే అనాసిన్ బాధనుంచి సత్వర నివారణ కలిగిస్తుంది.

***సురక్షితమైనది.***.ఎందువలనంటే అనాసిన్ డాక్టరు ఇచ్చే మందుల మిశ్రమం వంటిది. మీరు దానిని సురక్షితంగా పిల్లలకు గూడా ఇవ్వవచ్చును. అన్ని మందుల విషయంలో వలె, మీ పిల్లలకు దీని సరియైన మోతాదు కోసం మీ డాక్టరును సంప్రతించండి.

జలుబు మరియు ఫ్లూ వలన కలుగు నొప్పులకు, తలనొప్పి,
నడుం నొప్పి, కండరాల నొప్పులకు మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.



**అనాసిన్**

**భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పి నివారిణి**

Regd. User of T.M., Geoffrey Manners & Co. Ltd.

# ఇంకోసారి ...

అబ్బాపతు వాళ్లనూ కొల్లలు కొల్లలుగా పాత్రలద్వారా పాత్రలు పలికే మాటలద్వారా.. నా నంబర్ మూడో కథలో పరిచయం చేశాను.

పనసకాయ దొరికినప్పుడే తద్దినం పెట్టేస్తే మంచిదని దేశనాయకుల్నికూడా నా కథలో (నంబర్ మూడవ) యెక్కువగా ఉంచుదామనుకున్నాను.

స్థలాభావంచేత న్యూసెన్సులను పరిమితం చేయాల్సి వచ్చింది.

అయినా అన్నమంతా పట్టిచూడాలేంటి ... దేశనాయకులంతా 'స్టాండర్డ్' సైజులోకి మారిపోతారనేది నిర్వివాదాంశం నేనీ నిర్ణయానికి రావటం గత పదిహేడు నెలలు మీ పత్రికల్లో పడిన కార్టూన్లు చూసిన తర్వాతేనని గ్రహించగలరు.

పొరపాటున ఏ సినిమావాళ్ళయినా నా కథగాని కొనుక్కుపోతారేమోనని వాళ్ళకు కావల్సిన హంగులు విన్నీ జొప్పించాను.

నేను సృష్టించిన క్లబ్ డాన్సర్ ముందు...యింతవరకూ సినిమాలోకంలోని ఏ సెక్సుబాంబయినా బలాదూర్ ... ప్రేక్షకులు కోరేది యివ్వటం సినిమావాళ్ల సాంప్రదాయం కనుక — పాఠకులు కోరేది వ్రాయటం రచయిత బాధ్యత — సినిమావాళ్ళకూ... రచయితకూ ... తేడా యేమిటంటే...వాళ్ళు గుడ్డలు విప్పేసి నాట్యం చేస్తున్నట్లు తెరమీద చూపిస్తారు—

రచయిత కాగితంమీద వ్రాస్తాడు— అంతే !

యిన్నిరకాల మనస్తత్వాల్నీ ... మనుగడల్నీ... ఎత్తుగడల్నీ ... ఇంత తక్కువ పేజీల కథలో ... యిరికించి పాత్రచిత్యానికి భంగం రాకుండా ... కథాగమనంలోని అందం చెడకుండా ... ఉత్కంఠ కలిగించేలా వ్రాయటం అనేది అసామాన్యమైనదనిన్నీ ... అరుదైనదనిన్నీ, తమకు తెలియని విషయం కాదు.

కథలోని పాత్రలు ... సంభాషణలూ... చివరకు విట్సూ గూడా నా స్వకపోల కల్పితమేననీ... దేనికీ అనువాదం... అనుసరణ కాదని మీరు కోరినట్లుగా నా నంబర్ మూడవ కథ వ్రాతప్రతి మీదే వ్రాసాను.

నా కథలోని విషయాలు భారతదేశంలో ఏ ఒక్కరి జీవితాన్నయినా సరిదిద్దగల్గితే... తద్వారా లభించే అంతర్జాతీయ కీర్తి అంతా నా కథ ప్రచురించిన మీకే చెందుతాయని వేరేగా నేను వ్రాయనక్కర్లేదు—

కథలో బిగువు...కథనంలో వైశిష్ట్యత... పాత్ర చిత్రణలో ఔన్నత్యం ... కల్పనలో కమ్మదనం... మిమ్మల్ని ... మీద్వారా పాఠకుల్ని ఆకట్టుకుంటాయనే భావిస్తాను.

చేబ్రోలు } ఇట్లు భవదీయుడు
13-7-72 } ఆమంచిసత్యశివ
శంకర సూర్యవెంకటలక్ష్మీనరసింహ సుందర ప్రకాశరాజేశ్వర రంగసోమయాజులు వ్రాలు

**ఇందుతో జతపరచబడినవి :**

1. తిరిగొచ్చే కథ 12 పేజీలు (కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయబడినది.)

2. స్టాంపులు అతికించిన స్వంత చిరునామాగల కవరు.

(నంబర్ రెండోసారి మీరు విచారించారు, అదేసారి నేను సంతోషించేదీ తాలూకూ 'సర్టిఫైడ్ కాపీ' పంపే నిమిత్తం)

**పి. యస్.**

ఈ కథ నాలుగురోజుల క్రిందటే మీకు పంపాల్సింది — కాని మా ఊరి పోస్టాఫీసులో ఎప్పటిలాగే స్టాంపులు దొరక్కపోవటంవల్ల వాయిదా వేయాల్సొచ్చింది. అయితే... ఈ వ్యవధిలో మీ నంబర్ రెండవ విచారం సంతోషంగా అనేక రాష్ట్రాలు తిరిగి నా వద్దకు చేరింది. కనుక మీరు 'సర్టిఫైడ్ కాపీ' పంపనక్కర్లేదు. అయినా పైన హామి యిచ్చాను గనుక తమరు నంబర్ తొమ్మిది కథలకు విచారించేంత... నేను సంతోషించగలనని మనవి చేస్తున్నాను— ఎలాగూ స్టాంపులంటించిన కవరు జతపేశాను కనుక మీరేం పంపదల్చుకున్నా ఆ కవర్లోనే పంపండి.

చేబ్రోలు } సం॥ పై విధంగానే.
17-3-72 }

## పంపిణీదారులు ప్రారంభించిన చిత్రం

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'తాత మనవడు' చిత్రం షూటింగు ఆగస్టు 23 న ఉదయం 7 గంటలకు విక్రంలో ప్రారంభమైంది. లక్ష్మి ఫిలింస్ శివరామకృష్ణయ్య స్విచ్ ఆన్ చెయ్యగా, తారక రామా ఫిలింస్ రాఘవేంద్రరావు క్లాప్ కొట్టగా, మొదటి షాటును ఎస్వీ రంగారావుపై దాసరి నారాయణరావు చిత్రీకరించారు. ఈ ముహూర్తానికి వచ్చిన అతిథులను పేరు పేరున పేర్కొనాలంటే రెండు పేజీలు పడతాయి... పడవు.

## రంగారావు—అంజలీదేవి

పై చిత్రానికి కథ, మాటలను, సినిమా అను కరణను కూడా దాసరి చేపట్టారు. ప్రధాన పాత్రలను ఎస్వీ రంగారావు, అంజలీదేవి, గుమ్మడి, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రేలుక పోషిస్తున్నారు. కథానాయికగా విజయనిర్మల, రంగారావు మనవడిగా రాజబాబు నటిస్తున్నారు. కె. రాఘవ నిర్మించే యీ చిత్రానికి కన్నప్ప ఛాయను, రమేష్‌నాయుడు సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. తారకరామ విడుదల.

## విజయనిర్మలకు ప్రశంస !

నటి విజయ నిర్మల దర్శకత్వంలో తయారవుతున్న మళయాళచిత్రం మొదటి షెడ్యూలులోనే 8 రీళ్ళు వచ్చిందట. ఈ చిత్రంలో నాయిక పాత్రను కూడా ఆవిడే పోషిస్తుంది. పెట్లో దర్శకురాలిగా ఆమె యిస్తున్న సూచనలను అందరూ మెచ్చుకుంటున్నారు. రషస్ చూసినవాళ్ళు అభినందిస్తున్నారు.

## విఠలాచార్య చిత్రంలో ఎన్. టి. ఆర్.

గత సంవత్సరం 'నట సామ్రాట్' నాగేశ్వరరావుతో 'బీదలపాట్లు' నిర్మించారు, విఠలాచార్య. దురదృష్టవశాత్తు, ఆచిత్రం ఆర్థికంగా దెబ్బ తిన్నది. ఈ జనవరిలో ఆయనతో రెండవ చిత్రం నిర్మించనున్నట్లు ఆచార్య చెప్పగా పాఠకులకు తెలిపియున్నాను.

గత వారం నాకు అందిన వార్తలనుబట్టి విఠలాచార్య 'నటరత్న' ఎన్టీ రామారావును తన

'కాలం మారింది'లో శారద.

ఊరిక ఉపకారం ల చలం, ఆంజ.

## సెప్టెంబర్ మాసంలో 'విచిత్రబంధం'

ప్రముఖ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు ఈస్ట్‌మన్ కలర్‌తో నిర్మించిన 'విచిత్ర బంధం' చిత్రం సెప్టెంబరు మాసంలో విడుదల అవుతుంది. ఈ చిత్రానికి యద్దనపూడి సులోచనా రాణి 'విజేత' నవల ఆధారం. సినిమాకు అవసర మయిన మార్పు, చేర్పులు సముచితంగా చెయ్య బడిన యీ చిత్రానికి ఆదుర్తి సుబ్బారావు దర్శ కుడు.

ప్రేక్షకులు యీ చిత్రంకోసం వేయికండ్లతో



'బడిపంతులు'లో ఎన్. టి. రామారావు, అంజలీదేవి.

చిత్రంలో నటించమని అడిగినట్లు, ఆయన తన అంగీకారాన్ని తెలిపినట్లు తెలుస్తోంది.

## ఆయనతో తీస్తే తప్పా?

నేను విన్నవార్త అక్కినేని దాకా వెళ్ళింది అని తెలిసింది. 'ఏమండీ, యిది నిజమేనా?' అని ప్రశ్నిం చాను. నాకు నిజం ఏమిటో తెలియదుగాని ఆయ నతో తీస్తే తప్పా? అని ఎదురు ప్రశ్న వేశారు. ఆచార్య అంటే తనకు ఎప్పుడూ గౌరవభావం వుంటుందని, ఆయన నాలుగు డబ్బులు ఆర్జిస్తే ఎక్కువగా సంతోషించే వ్యక్తుల్లో తను ఒక డుగా వుంటానని అక్కినేని చెప్పారు.

## సినిమా
## విజయభట్‌కి కథ రెడీ

'భలేరంగడు' తర్వాత విజయభట్ మూవీస్ అక్కినేని నాయకత్వంలో నిర్మించనున్న చిత్రానికి కథ రెడీ అయింది. ఈ చిత్రానికి తాతినేని రామా రావు దర్శకుడు. నాయికగా ఎం. జి. ఆర్. నుండి బంధవిముక్తి పొందిన 'రిక్షారాముడు' ఫేం మంజుల నటిస్తోంది. నవంబరులో సెట్స్‌కి వెళ్ళ నున్న యీ చిత్రానికి మోదుకూరి జాన్సన్ మాట లను, మహదేవన్ సంగీతాన్ని సమకూరుస్తారు. అన్నపూర్ణా విడుదల.

## సినిమా డైరీ

- అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'విచిత్ర బంధం' ఆగస్టు 22న సెన్సారు అయింది. 30 నుండి 4 వరకు రీ—రికార్డింగు జరుగుతుంది.
- శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ వారి 'పాపం పసివాడు' ఆగస్టు 29న సెన్సారుకు పంపబడు తుంది.
- కె. ఎస్. ఆర్. పిక్చర్స్ 'బంగారు మనసులు' 8 రీళ్ళు తయారైంది.
- సూర్యరాజ్ పిక్చర్స్ 'ప్రొడక్షన్స్ నెం.2'లో కృష్ణకుమారి, ప్రభాకరరెడ్డి, భార్యా భర్తలుగా నటిస్తున్నారు.
- అభిరామి ఫిలింస్ వారి 'దేవీ లలితాంబ' చిత్రంలో చంద్రమోహన్ నాగరాజు పాత్రకు బుక్ అయ్యారు.
- విశ్వభారతి ప్రొడక్షన్స్ వారి మొదటి షెడ్యూలు హైద్రాబాద్ సారథిలో సెప్టెంబర్ 1న ప్రారంభమవుతుంది.
- పద్మశ్రీ పిక్చర్స్‌వారి 'ప్రేమకోసం' ఆఖరి షెడ్యూలు సెప్టెంబర్‌లో జరుగుతుంది.
- విజయభట్ మూవీస్ నిర్మించే చిత్రాన్ని యీసారి అన్నపూర్ణా ఫిలింస్ పంపిణీ చేస్తారు.




నటుడు కాంతారావు.

(చిత్రకారుడు : శ్రీ నవీన్‌కుమార్)

నిరీక్షిస్తున్నారు. ఈ చిత్రంమీద పరిశ్రమకి, ప్రేక్షకులకి పెద్ద హోప్ వుంది.

అందరి హోప్‌కు తగ్గట్టు కథ మాంచి ఫ్లోలో సాగింది. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, మహదేవన్, సెల్వరాజ్ ఒకర్నిమించి మరొకరు పని చేసినట్టు తెలిసింది.

చిక్కటి కథను చక్కగా చిత్రించే అలవాటు ఆదుర్తికి, అలాంటి చక్కటి కథను నిర్మించ డంలో తనకు తనేసాటి అనిపించుకునే దుక్కి పాటికి 'విచిత్రబంధం' విశేష ధనార్జన చేసిపెట్టడం ఖాయం. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగేశ్వరరావు, వాణిశ్రీ, గుమ్మడి, అంజలీదేవి, పద్మనాభం, సూర్యకాంతం, రాజ బాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య పోషిం



గర్భస్థ శిశువు యొక్క కాల్షియం అవసరాలు గర్భిణీ సమయంలో, ముఖ్యంగా చివరి 3 నెలలో హెచ్చుగా పెరుగుతాయి. అందువలన తల్లులు అవసరమైనంత కాల్షియం శాండోజ్‌ను మొదటి నెల నుంచీ తీసుకోవటం అవసరం.
28.6
16.64
10.44
4.66
1.6
0.045
1 2 3 4 5 6 7 8 9 నెలలు




dCP/CS/5d tel

# సినిమా

## శోభన్‌తో శారద, జయంతి

అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైసెస్ నిర్మించ నున్న సాంఘికచిత్రంలో శోభన్‌బాబుతో శారద, జయంతి నాయిక పాత్రలను పోషిస్తారు. పి. రాఘవరావు నిర్మించే యీ చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు.

పై చిత్రానికి బొల్లిముంత మాటలను, చక్రవర్తి సంగీతాన్ని, జి. కె. రాము ఛాయను, అంకిరెడ్డి కూర్పును నిర్వహిస్తారు. ముఖ్య భూమిక లను రాజబాబు, అల్లు రామలింగయ్య, రావు గోపాల రావు ధరిస్తారు. జ్యోతి విడుదల.

## జ్యోతి శేఖర్‌బాబు నిర్మించే చిత్రం

జ్యోతి ఫిలింస్ నారాయణరావుగారి అబ్బాయి కృష్ణ కిశోర్ పిక్చర్స్ అనేడి సంస్థను స్థాపించారు. ఈ చిత్రానికి పినిసెట్టి మాటలను వ్రాస్తున్నారు కృష్ణ, జమున ప్రధాన పాత్రలను పోషించే యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. జ్యోతి విడుదల.

## పసి హృదయం వున్న దంపతులు

గోరు ముద్దలు తినిపించేది పసి వయసులోనే కాదు—వయసు పెరిగినా కల్మష మెరుగని పసి హృదయాలకు పరస్పరం ఆ అనుబంధం వుండక మానదు.

'నాకోసం నువ్వు చేసిన పచ్చడి రుచి, నీ చేతికి తెలియదు. నా చేత్తో తిని చూడు' అని అనురాగంతో లాలించే భర్త, అతడి లాలిత్యానికి వెన్నముద్దలా కరిగిపోయి మైమరిచే భార్య, ఇక ఆ దాంపత్యంలో వుండే ఔన్నత్యాన్ని వేరే చెప్పాలా? ఇంతకీ ఎవరి దాంపత్యంగూర్చి యింత వ్రాసానో మీకు తెలియాలిగా. త్రివేణి ప్రొడక్షన్స్‌వారి 'బడిపంతులు' చిత్రంలో ఎన్టీ రామారావు, అంజలీదేవిగార్ల దాంపత్య జీవితాన్ని గూర్చే. ఈ దృశ్యం చూస్తున్నప్పుడు ప్రతి ఆలు మగలు యిలా అనురాగ బంధితులై వుండాలనుకుంటారు. అంత సహజంగా దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి చిత్రీకరించారు.

పై చిత్రానికి డి. వి. నరసరాజు మాటలను, మహదేవన్ సంగీతాన్ని, కె. ఎస్. ప్రసాద్ ఛాయను, కృష్ణారావు కళను, అంకిరెడ్డి కూర్పును, సహకార దర్శకత్వాన్ని భాస్కర్ నిర్వహిస్తున్నారు. పి. పేరరాజు నిర్మిస్తున్న 'బడిపంతులు' సెప్టెంబర్‌లో పూర్ణా ద్వారా విడుదలవుతుంది.

—శ్రీనివాస్ ●







## జరిగిన కథ

తల్లికి ఇష్టంలేకపోయినా ఎం. ఎ. లో చేరాడు విద్యార్థి. తన అప్పకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని ఆమె సంకల్పం. కాని, లక్ష్మి ఎవరినో ప్రేమిస్తున్నట్టు తెలుసుకున్న విద్యార్థి, మేనమామతో వాదం పెంచుకుని తిరిగి వచ్చేస్తాడు. మెడిసిన్ చదువుతున్న ఆనంద్ అతని రూమ్మేటు. అతని ద్వారానే సుందరి పరిచయమవుతుంది విద్యార్థికి. మామయ్య అప్పు తీర్చేటప్పటికి బాంకులో డబ్బు అయిపోయింది. ఇక ముందు చదువుగతి ఏమిటని విచారంలో మునిగిపోతాడు విద్యార్థి. గదిలో జరిగిన దొంగతనంవలన వేరే గది తీసుకుంటాడు. సత్యం కథ అతన్ని పొదుపరిగా మారుస్తుంది. ప్రైవేటుగా ఎం. ఏ. చదివే జ్ఞానాంబతో అతని పరిచయం పెరుగుతుంది. లక్ష్మి మోసపోయిందని తెలుస్తుంది. జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. అందుకే చనువు పెంచుకోసాగాడు. జ్ఞానాంబ ఆశయం విన్న విద్యార్థి ఆశ్చర్యపోయాడు.

# 11

విద్యార్థి ఆలోచిస్తున్నాడు ... అతడి ఎదుట నల్లని నుదుట ఎర్రని తిలకం ధరించిన ఆ అమ్మాయి రూపుదాల్చిన శాపగ్రస్థలా అనిపించింది క్షణంపాటు అతడికి భయం కూడా వేసింది. ఈ పిల్లతో వచ్చి హితత్వం తనను కూడా నాశనం చెయ్యదు కదా?... అసలే తనుకూడా విధికి ఎదురు తిరుగుతున్నవాడు ... ప్రాప్తం లేనిదని, అందరూ వలదన్నదాన్ని సాధించాలని కృతనిశ్చయంతో వున్నవాడు.

అయినా ఈ భగవంతునికి ఎందుకింత కక్ష మానవులంటే? మానవ సంకల్పాన్ని మట్టిపాలు చెయ్యాలని ఎందుకింత దీక్ష? మానవులు కేవలం తనచేతిలో మట్టిబొమ్మల్లా వుండాలనే కోరుతాడా దేముడు? ...అయివుండదు ... చదరంగపు ఆటలో రెండువైపులా తనే పావులు నడిపితే ఏం ఆనందం వుంటుంది?...

ఒక మహారచయిత వుంటాడు...అతడి లేఖినినుండి జీవం పోసుకున్నపాత్ర అతడి వూహల పరిధులలో వున్నంతవరకే అతడు అభిమానిస్తాడా?...అతడి వూహల పరిధుల నతిక్రమించి రచయితనే 'డామినేట్' చేసి మగ్గున పడేసే పాత్రలను అతడు ప్రేమించకుండా ఎలా వుండగలడు?...

పరిపరివిధాల పోతున్న ఆలోచనలకు అనకట్టకట్టి ఆలోచనా మగ్న అయిన జ్ఞానాంబను చూశాడు విద్యార్థి...'రండి జ్ఞానాంబగారూ...ఇలా కూచుంటే ఏం బాగుళ్ళేదు...సరదాగా ఆకొండ ఎక్కివద్దాం రండి...చాలా తమాషాగా, నిట్టనిలువుగా కాకుండా పడుకున్నట్టు చాలా తమాషాగా వుంది కదూ యీకొండ?...' అంటూ ఆ అమ్మాయి నిర్వేదం పోగొట్టడానికి లేని హుషారు తెచ్చుకుని చకచకా నడిచాడు విద్యార్థి...

సర్వమూ మర్చిపోయి చిన్నపిల్లలా వెంబడించింది జ్ఞానాంబ...రాళ్ళు కొడుతున్నందువల్ల కాబోలు ఆ కొండ అంతా నున్నగాలేదు...ఒకచోట మన్నగా పరిచినట్టుంటే, యింకోచోట చెక్కిన కత్తిలా, పదునుగా సూటిగా వుంది ... పసిపిల్లలా గెంతుతూ నడుస్తున్న జ్ఞానాంబకు చెక్కిన కొండరాయి తగిలి కాలికి ఎదురుదెబ్బ తగిలింది...

'అబ్బా!!...' అంది బాధతో ... ఆ అమ్మాయి కంటివెంట రెండుమూడు నీటిబొట్లు దొర్లినాయి...వేలినుండి సంతతధారగా కారుతోంది రక్తం ... అంతలోకే నవ్వేసింది జ్ఞానాంబ...

కారేరక్తం...కన్నీళ్లమధ్య నవ్వుతున్న జ్ఞానాంబ...చలించాడు విద్యార్థి...పరుగున వెళ్ళి పక్కనున్న చిన్ననీటి దోనెలో రుమాలు తడిపి తీసుకొచ్చాడు...వేలికి కట్టుకడుతుంటే రక్తం యింకా ఆగలేదు ...గాయం బాగా లోతుగా తగిలింది...

'ఇంక పోదాం పదండి...' అన్నాడు యిక ఆ రక్తం ఆపేప్రయత్నం లేనక...

'మరి బత్తాయితోటలో?... ఇంత దూరమూ వచ్చి చూడకుండా వెళ్తా?...'

అబ్బ ఏంపిల్లరా బాబూ...ఈ అమ్మాయి మానవ మాత్రురాలు కాదు...ఇప్పుడు తను గనక ఆ క్రించేదే బత్తాయితోట వున్నాడంటే పోదామని కూచుంటుంది...అందుకని...

'ఇక్కడెక్కడో వుంటుందన్నారండి... కాని యివ్వాళ్టికిక నేను నడవలేనండి, సారీ జ్ఞానాంబగారూ...ఈసారి జాగ్రత్తగా గుర్తులు కనుక్కుంటాను లెండి...మళ్లీ రావచ్చు...అప్పుడే బత్తాయి. మామిడి తోటలు కూడా చూడొచ్చు...' అన్నాడు...

'అయ్యో!... యింతదూరం వచ్చి చూడకుండా పోవడమా ... అవెక్కడున్నాయో మీక్కూడా సరిగా తెలియదా? ... మరి తెలుసు చూపిస్తామన్నారు కదండీ ... సరే పోదాం పదండి... మీ రిక నడవలేనంటున్నారుగా...' బాధనంతా దిగమింగి నెమ్మదిగా కుంటుకుంటూ బయలుదేరింది.

ఇద్దరూ తిరుగుముఖం పట్టారు. అయితే ఈసారి తాటిబావుల దగ్గరనే మలుపు తిరక్కుండా సరాసరిపోయి అక్కడ తిరిగారు. దాంతో కాలువదిగి దాటకుండానే ఒక సైఫను మీదుగా వచ్చేశారు. చేలకడ్డం పడి యిద్దరూ లయోలా పబ్లిక్ స్కూల్ వెనుక వైపుకు చేరుకోగలిగారు. వాళ్ళ అదృష్టం కొద్దీ సిటీబస్ సరిగ్గా సమయానికి వచ్చింది.

టి. బి. దగ్గర దిగగానే ఒకరిక్షా పిలిచాడు విద్యార్థి, తను అక్కడే కిళ్లీకొట్టులో పెట్టిన సైకిలు తీసుకుంటూ. అతడు హాస్పిటలుకు రిక్షా మాట్లాడుతుంటే కలుగజేసుకుని. 'హాస్పిటలుకు

విరుచుకుంటే... ఇంత పంచదార నూరి అద్దితే పొయ్యే భాగ్యానికి.' అంది జ్ఞానాంబ.

'జ్ఞానాంబగారూ...మీరు మాట్లాడ్డానికి లేదు. నేను చెప్పినట్టు చెయ్యాల్సిందే. ముందు రిక్షా ఎక్కండి.'

'వినకపోతే?...' నవ్వుతూ అడిగింది జ్ఞానాంబ. నొప్పిపుడుతున్నవేలును ఎత్తుగా వున్న ఒక చిన్నరాయిమీద పెడుతూ...

'వినకపోతేనా!... మీ కంటె మొండి వాడ్ని నేను. మర్యాదగా ఎక్కకపోతే... అమాంతం ఎత్తి రిక్షాలో కూర్చో బెడతాను.' అన్నాడు ఆప్యాయత కూడిన చనువుతో...

మారు మాట్లాడకుండా ఎక్కింది జ్ఞానాంబ. దోవలో మెడికల్ కాలేజి దగ్గర వినయభూషణ్ కన్పించాడు. అతడుకూడా విద్యార్థి వెంట హాస్పిటలుకు వచ్చి తన ఫ్రెండ్ సునీతిని, తనరూమ్మేట్నూ, తనకంటే సీనియరూ అయిన దేవసహాయాన్నీ విద్యార్థికి పరిచయం చేశాడు... సునీతి, దేవసహాయం యిద్దరూ సత్యం వూరివాళ్ళే...సునీతి ఫైనలియరులో వుంది. దేవసహాయం హౌస్‌సర్జన్ చేస్తున్నాడు... ఇద్దరూ కాజువాలిటీ వార్డులోనే వున్నందున ఆలస్యంలేకుండా వెంటనే ఏ. టి. ఎస్. యింజక్షను యిచ్చి, గాయాన్ని వాష్‌చేసి రెండుమూడు కుట్లు వేసి బాండేజి కట్టారు. అతి సింపిల్‌గానూ వుండి, ఎంతో ఆత్మీయంగా సంచరించే నిగర్వి అయిన 'సునీతి'ని చూస్తే జ్ఞానాంబకు చాలా ఆశ్చర్యం వేసింది...

విద్యార్థి మళ్లీ రిక్షాలో జ్ఞానాంబను దింపి యింటికి చేరుకునేసరికి ఏడుగంటలు దాటింది...

మర్నాడు ఆదివారం కావడంతో బద్ధకించి ఆలస్యంగా లేచిన విద్యార్థికి జ్ఞానాంబ జ్ఞాపకం వచ్చింది. ఎలావుందో పాపం, అనుకుంటూ కాఫీ టిఫిన్ ముగించాక, జ్ఞానాంబ గదికి వెళ్ళడానికి బయులుదేరుతుండగా లోకన్‌బాబు వచ్చాడు.

'ఏమైపొయ్యారండీ గురువుగారూ? నిన్న సాయంత్రం కాలేజిలోనూ కన్పించలేదు...నేనూ సత్యం యింటికి వస్తే, యింట్లోనూ లేరు.' వస్తూనే అడిగాడు లోకన్‌బాబు.

విద్యార్థి అంతక్రితం రోజు జరిగిందంతా చెప్పి, 'హాస్పిటలునుండి వచ్చేసరికి బాగా చీకటి పడింది. సరే యింతకూ మీరొక్కరూ వచ్చారు. సత్యం ఏడీ?' అని ప్రశ్నించాడు.

'సత్యం ఏదో పనుందని వూరికెళ్లాడండీ ...ఏం తోచటంలేదు...పోనీ 'లీలా'లో మంచిపిక్చరుంది ... చూటానికి మిమ్మల్ని



కూరా చెంబు పెట్టుకు వెళ్ళామని వచ్చాను."

విద్యార్థికి పిక్చరుకు వెళ్ళాలనిపించలేదు. 'జ్ఞానాంబను చూడాలి రాలే'నని చెప్పాడు. లోకన్‌బాబు నవ్వాడు.

'వారేవాహ్!... ఏం ధర్మగుణమండీ!... సాయం చేసినా ఒక్కటికి పదింతలు రాబట్టుకునేచోట చేస్తున్నారీరోజుల్లో... మీరెక్కడ దొరికారండీ యిక్ష్వాకులనాటివాళ్ళు! ... ఆ ఎలిమెంటరీస్కూలు సింగరేణి బొమ్మకోసం లక్షణమైన పిక్చర్ వదులుకుంటారు... ఇంక చాలుగనీ లేచి బట్టలేసుకోండి...మంచి పిక్చర్...మళ్ళీమళ్ళీ రాదు' అన్నాడు.

జ్ఞానాంబనలా చులకనచేసి మాట్లాడుతుంటే విద్యార్థికి కష్టం వేసింది.

'మనిషి నల్లగావుంటే మనసు నల్లగా వుండాలనేముంది? ... అంత చులకన చేసి మాట్లాడకండి లోకన్ బాబుగారూ' అన్నాడు.

'అయిందీ...పద్దారు లైన్‌లోగ...' ఎగతాళిగా అన్నాడు లోకన్‌బాబు.

'అందర్నీ ఒకే తాటకట్టడం న్యాయం కాదు. అయినా నాకు పిక్చరుకు రావాలని లేదు. రాను. అంతే' నిరుత్సాహంగా చెప్పేశాడు.

లోకన్‌బాబు మాట్లాడకుండా వెళ్ళిపోయ్యాడు.

హుం...అనుకున్నాడు విద్యార్థి ... ఇదే

# విద్యార్థి

ఏ సుందరిలాంటి పిల్లో అయితే వీళ్ళంతా తనను చుట్టుకుని చుట్టుకుని తిరిగే వాళ్ళు... తన అదృష్టాన్ని పొగిడి వుండే వాళ్ళు ... లోలోపల ఏడ్చుకునే వాళ్ళు కూడా... అదే ఒక అభాగిని అయితే పరిహాసాలు చేస్తున్నారు! ... ఏమయినా కానీ ఎవ్వరేమన్నా అనుకోనీ జ్ఞానాంబ పరిచయం. అది ఏ బవంటి విష పరిణామాలకు దారి తీసినా సరే ... తను వదులుకోకూడదని నిశ్చయించుకున్నాడు విద్యార్థి.

జ్ఞానాంబకు జ్వరం తగిలింది ... అయినా లక్ష్యం చెయ్యకుండా అలా తిరుగుతూనే వుంది. విద్యార్థి కోప్పడి హాస్పిటల్ తీసుకువెళ్ళి అక్కడ విజయభూషణ్ రూమ్మేటు దైవసహాయం వున్నాడు గనుక అతని సాయంతో వెంటనే మందు తీసుకుని వచ్చేవాడు ... ఇంటివాళ్ళు జ్ఞానాంబకు కాఫీచేసి యిచ్చారు.

జ్ఞానాంబ జ్వరం వారంరోజులకుగాని తగ్గలేదు. ఆ వారంరోజులూ జ్ఞానాంబకు మందు తెచ్చి యిస్తుండేవాడు. కాలేజి మానడానికి జ్ఞానాంబ అసలొప్పుకోనందున సాయంత్రం కాలేజినుండి రాగానే బ్రెడ్ తెచ్చివ్వడం చేసి వెళ్తుండేవాడు. విద్యార్థికి చదువు సాగటంలేదు. అనవసరంగా ఆ రోజు తనే అక్కడికెళ్ళామని కదిసాడు.

ఈ జ్వరం యిప్పటికి తగ్గుతుందో ఏమో... అనే భయం పట్టుకుందతడికి.

జ్ఞానాంబకు జ్వరం తగ్గి పత్యం తీసుకునేసరికి పరీక్షలు వారంకూడా లేవు. తనా ఏమీ చదవలేదు. పరీక్షలు రాద్దామా వొద్దా?... అనుకొంటుండగా తల్లిదగ్గర నుండి వుత్తరం వచ్చింది. రోడ్డుపక్క చేలో కుప్పనూర్పిడి అట ... వెంటనే రమ్మని రాసింది. తన చదువంతా యీ పంటలో వచ్చేడబ్బుమీద జరగాల్సిందే కదా... ఈ టర్ము వల్ల ఎగ్జామ్స్ చాలామంది మానేస్తూనే వున్నారు. కాబట్టి తను వూరికి వెళ్ళడమే మంచిదనిపించింది విద్యార్థికి...

ధాన్యం వచ్చింది. దగ్గర్లోవున్న బస్తీలో ఫాక్టరీకి తోలారు ధాన్యం... కొన్నిబస్తాలు యింటిదగ్గర వడ్లకొట్టులో పోశారు... ఫాక్టరీలో డబ్బు రెండురోజులు తిరిగితేగాని రాలేదు. తీరా డబ్బు చేతికందాక యింటి ఖర్చుకు కొంత తీసి వుంచాల్సి వచ్చింది... ధనమ్మగారు యిప్పుడూ ఒకటిగానే ఖర్చు పెడుతుంది. భర్త వుద్యోగం చేస్తున్నప్పుడు ఎలా ఖర్చుపెట్టేదో యిప్పుడూ అంతే... కాస్త ఖర్చు తగ్గించడానికి ఆవిడను ఒప్పించేసరికి తాతలు దిగొచ్చారు...సరే ఆవిడకివ్వంతా యిచ్చేసి మిగతాది బాంకిలో వెయ్యాలనుకుంటే...అందులోంచి ఇంకో రెండువందలడిగింది ధనమ్మగారు. పెద్ద కూతురికి ఏడవమాసం వస్తుందిట. శ్రీమంతం చెయ్యాలి. ఊళ్ళో అందర్నీ భోజనాలకు పిలవాలి...అంది.

విద్యార్థికి విసుగేసింది...అదేదో ఓ యాభైలో పూర్తి చెయ్యకూడదా?... వూరంతా పిలవకపోతేనేం ... ఇదివరకంటే రోజులు వేరు. ఒకరింట్లో వేడుక జరిగిందంటే...ఒకరు కూరలు పంపే వాళ్ళు. ఒకళ్ళు పాలు ఒకళ్ళు పెరుగు నెయ్యి యిలా సర్దుకునేవాళ్ళు...ఒక్క కుటుంబంగా అందరూ వచ్చి తలోపని సాయంచేసి పెట్టేవాళ్ళు...కానీ యిప్పుడు ఎవరికివారే శ్రీరామరక్ష అనుకుంటున్న రోజుల్లో యింకా వెనకటి ఆచారాలు పట్టుకు వేళ్ళాడ్డమేమిటి ?... అన్నాడు.

ధనమ్మగారు కంట తడిపెట్టింది... 'చాలిమాలు...వాళ్ళనాన్నగారే వుంటే యిలా చేసేవాడా ?...' అంది.

విద్యార్థి మారు మాట్లాడలేదు...రెం

మనం ఇలా కలవకుండా — ప్రేమలేఖలతో రాసుకుంటూ వుండే వుంటే సరదాగా వుండేదేమో!!



డొంద్గలు చేతిలో పెట్టాడు...ఇవ్వాడయినా రెండుజతలు బట్టలు కొనుక్కోవచ్చు ననుకున్నాడు ... ఆ ఆశకూడా లేకుండా పోయింది.

తెలుగునాట సంక్రాంతి పెద్దపండుగ... పిల్లాజెల్లా అంతా నూతన వస్త్రాలు ధరించి ఆనందించే పండుగ...కానీ విద్యార్థికి కొత్తబట్టల్లేవు. తమ్ముడికీ, ఆశకుమాత్రం చెరిఒక జత కొన్నాడు. ధనమ్మగారు పండుక్కి బొమ్మలు పెడతామన్నారు... కానీ పరిస్థితులు గ్రహించిన ఆశ... 'ఫిఫ్త్ఫారం చదువుతున్నాను ... నేనింకా బొమ్మలు పెట్టుకోడ మేమిటమ్మా.' అంటూ వద్దన్నది. చెల్లిని మనసులోనే దీవించాడు విద్యార్థి...

ఆ నెలరోజుల సెలవుల్లో వూళ్లో పనులన్నీ అయినయి ... యింటిపన్ను పొలం పన్నులు కూడా కట్టేశాడు ... మిగిలిన దానితో జాగ్రత్తగా వాడుకుంటే ఫర్వా లేదు ... వీటన్లాగో ఏడాది నెట్టెయ్యచ్చు అనే ఆశతో గుంటూరు తిరిగి వచ్చాడు విద్యార్థి...

కాలేజి తియ్యగానే, రాష్ట్రంలో జరుగుతున్న హిందీ వ్యతిరేకోద్యమానికి సానుభూతిగా మూడురోజులు సమ్మె జరిగింది. ఆ తర్వాత మళ్ళీ మామూలుగా క్లాసులు జరుగుతున్నయి. విద్యార్థి విక్కడలేని ఉత్సాహంతో రాత్రీపగలూ కష్టపడుతున్నాడు.

ఫిబ్రవరి వచ్చేసింది ... అప్పటిదాకా జ్ఞానాంబ సెలవుల్లో సేకరించిన లైబ్రరీ నోట్సు అంతా కాపీ చేసుకుంటున్న విద్యార్థి, సాయంత్రం ఐదు కావడంతో లేచి బావిదగ్గర చన్నీళ్ళ స్నానంచేసి, గదిలో గోడకున్న వేంకటేశ్వరస్వామి పటానికి అగరువత్తి వెలిగించి పెట్టి నమస్కరిస్తున్నాడు.

బయట చెప్పుల చప్పుడయి తిరిగి చూస్తే సత్యం.

'రారా సత్యం...కాలేజినుండేనా ?...'

'అవునుగానీ నువు రాలేదేరా ?...'

'ఇవ్వాళ వున్నదే ఒక్క అవర్...అదీ ఆ పుస్తకం నేను ఛాయిస్‌లో వదిలేద్దా మనుకుంటున్నాను...అందుకని యింట్లోనే కూర్చుని చదువుకుంటున్నాను...'

'ఇదుగో...మీయింటిదగ్గర్నుండే కాబోలు వుత్తరంట వచ్చింది ... అది యివ్వడానికే వచ్చాను...నే వస్తామరి...' అంటూ లెటర్ యిచ్చి వెళ్ళిపోయ్యాడు.

విద్యార్థి వుత్తరం చించి చదివాడు... ఒక్కసారిగా నీరసం వచ్చినట్లయిందతడికి. ...కుప్పలా క్యాంప్ కాట్‌మీద కూలబడ్డాడు ...మళ్ళీ తీసి చదివాడు...

చి. విద్యార్థిని మీ అమ్మ దీవించి వ్రాయునది...

ఉభయకుశలోపరి ... నేను క్రిందటి గురువారం అక్కయ్యను పురిటికి తీసుకు రావడానికి వెళ్ళాను ... అక్కయ్య చాలా నీరసంగా వుంది...వాళ్ళు అక్కడ బస్తీలో డాక్టరుకు చూపించారుట...వాళ్ళు కాన్పు కష్టం కావచ్చు నన్నారుట...మీ బావగారు ఆస్పత్రిలో చూపించి మందులూ యింజక్షనులూ యిప్పించేట్టయితేనే పురిటికి పంపిస్తానని షరతు పెట్టారు ... మనపిల్లను మనం మాత్రం అశ్రద్ధ చేస్తామా ?... అందుకని... గుంటూరులో కాపురం పెట్టి అక్కడే పురుడు పోస్తానని చెప్పి తీసుకు వచ్చాను. వచ్చే శనివారం మంచిరోజు... ఆరోజున నేనూ అక్కయ్యా వస్తాం...కాబట్టి ఎక్కడైనా మూడు గదులయిల్లు చూసి వుంచవలసింది. డబ్బుకు వెనుకాడవద్దు.'

విద్యార్థి వుత్తరాన్ని విసిరి టేబిల్ మీదికి కొట్టాడు...

డబ్బుకు వెనకాడవద్దుట. వెనుకాడ వద్దు. ఎక్కడనుండీ తెచ్చేట్టు ?... గుంటూరులో కాపురం అంటే మాటలా ?... అంతగా భార్య ఆరోగ్యం గురించి తెగ దిగులుపడే బావగారూ, ఆయనే గుంటూరు కాదు మద్రాసులో పెట్టి పురుడు పోయించుకోమను భార్యకు. తను కాదన్నాడా? ఈమె అంతకంటె...హుం... కర్మరా...ఖర్మ...అనుకున్నాడు.

అతడికి అందరిమీదా కోపం వచ్చింది... చివరికి యింకా ప్రపంచంలో కడుగు పెట్టని మేనల్లుడిమీద గూడా... ఈరేళ్ళో ఏళ్ళో పుట్టకుండా ఆగినవాడు మరో రెండేళ్ళు ఆగితే తను వుద్యోగం చేసేవాడు యింకా ఘనంగా పోయించేవాడుగా పురుడు...' అనుకున్నాడు.

ఏం చెయ్యలేక జుట్టు పీక్కున్నాడు కాసేపు... ఇప్పుడు యిల్లెక్కడ సంపాదించేట్టు... మళ్ళీ గదులవేట ప్రారంభించాలి కాబోలు... విసుగ్గా అనుకున్నాడు. డబ్బు సంగతి ఎలా?...

అతడు తల పట్టుకుని కూర్చున్నాడు. అంతా అయోమయంగా వుందతడికి... తన చుట్టూ ఎవరో వలయం పన్నుతున్నట్టూ, తనకంటె బలవంతుడెవరో తనకీ విషమ పరిస్థితులు కల్పించి, తను నవ్వుకుంటున్నట్లు అనిపించిందతడికి...

కుప్పలా కూలబడిపోయిన అతడు బయట ఆగిన చెప్పుల చప్పుడుకు తలెత్తి చూస్తే... ఎదుట జ్ఞానాంబ.

'ఓ...మీరా!...రండి...' మనసునిండా నిండుకున్న నిర్వేదం మాటల్లో కూడా ప్రతిఫలించేసరికి జ్ఞానాంబ ఆశ్చర్యంగా అతడి ముఖంలోకి చూస్తూ.

'ఏమండీ అలా వున్నారు? ... ఒంట్లో బాగుల్లేదా ?...' అని అడిగింది అతడు చూపించిన కుర్చీలో కూర్చుంటూ...

'ఒంటికేం ?... నిక్షేపంలా వున్నాను.' పెద్దగా నిట్టూరుస్తూ అన్నాడు విద్యార్థి.

'ఎప్పుడనా నేను చిత్రంగా మాట్లాడతా ననేవారు; ఇదేమిటి యివ్వాళ మీరు మరీ విచిత్రంగా మాట్లాడుతున్నారు !... నేను వచ్చి మీకేమీ యిబ్బంది కల్గించలేదు కదా ?' అంది.

'నో...నో ...అదేం కాదు ... మనసులోని దిగులు సూటిగా మాటల్లో చెప్పుకోలేని పరిస్థితి ఏర్పడ్డప్పుడు మనిషి చిత్రంగానే మాట్లాడుతాడు ..'

'మనస్సు!... దిగులు!... మీ నోటి వెంట కొత్త మాటలు వింటున్నాను విద్యార్థి గారూ ...'

'ఏం మనసూ, దిగులూ, బాధలూ కష్టాలూ యివన్నీ మీకే 'రిజర్వుడు' అనుకున్నారా జ్ఞానాంబగారూ ? ... ఆడవాళ్ళయితే కనీసం ఏడ్చో, నలుగురికీ చెప్పుకునో అయినా వూరట పొందుతారు...అదీ లేకుండా గుండెల్లో దాచుకోవలసిన బాధల బరువు మీకేం తెలుస్తుంది ?...'

'ప్లీజ్ !... విద్యార్థిగారూ ఏడవడం మాత్రం ఏడవకండి...ఎందుకంటారా ?... నా దృష్టిలో ఏడవడం ఒకవిధంగా ఓడిపోడం లాంటిది. అందుకని ... ఒకరితో

చెప్పుకుంటే పూర్తిగా కల్గుతుందని మీరను కుంటే, మీబాధ లేమిటో నాతో చెప్పు కోండి. అఫ్‌కోర్స్ మీ కభ్యంతరం లేక పోతేనే...'

విద్యార్థి సంకోచించాడు ... అతడికి సుందరి జ్ఞాపకం వచ్చింది... తన బాధలు విన్నాక తన ముఖం చూడ్డమే మానేసింది ... బహుశా యీ అమ్మాయి కూడా అలాగే చెయ్యదుకదా ... అనిపించింది ... అయినా చెప్పి చూడాలి యీ అమ్మాయి ఎలా ప్రవర్తిస్తుందో... అనుకున్నాడు.

మాట్లాడకుండా లేచి, రాకరాక తన గదికి వచ్చిన జ్ఞానాంబకు ప్లేటులో రెండు బిస్కట్స్ పెట్టి ముందు పెట్టిన విద్యార్థితో,

'మీరిలాంటి 'ఫార్మాలిటీస్' చూపిస్తే పాకెట్ పాకెట్ మొత్తం లాగెయ్యగలను సుమండీ...' నవ్వుతూ అంటున్న జ్ఞానాంబతో, 'అలాగే కానీండి.' అంటూ యింటి నుంచి వచ్చిన ఉత్తరం జ్ఞానాంబకు అందిచ్చాడు ... 'ఫరవాలేదు...చదవండి...' అన్నాడు.

ఉత్తరం పూర్తిగా చదివిన జ్ఞానాంబ అది అతడికి తిరిగి యిచ్చేస్తూ, 'అయితే— తప్పేదేముంది ?... ఇల్లు వెతకండి.' అంది...

'అది అంత సులువుకాదు జ్ఞానాంబ గారూ...పట్నంలో కాపురం పెట్టడం, డాక్టర్లూ మందులూ...మేమున్న ఆర్థిక పరిస్థితుల్లో ...అవి సాధ్యమయ్యేవి కావు...' అంటూ మొదటినుండి తనకథ...తను ఏ పరిస్థితుల్లో చదువు కొనసాగిస్తున్నదీ చెప్పు కొచ్చాడు విద్యార్థి...

అంతా విన్న జ్ఞానాంబ కంట తడి పెట్టలేదు...అంతకంటే సానుభూతి కురి పించలేదు...చిన్ననవ్వు నవ్వింది...

'విద్యార్థిగారూ ... నాకు మిమ్మల్ని చూస్తే నవ్వొస్తోంది ... ఏటికి ఎదురీద డానికి బయలుదేరి ఏరుచూసి పారి పోతారా ?... మహాప్రవాహాన్ని ఎదురీదే టప్పుడు...అలలే రావచ్చు...శిలలే రావచ్చు. మహామహా కొండలే రావచ్చు...అలనుచూసే మీరిలా భయపడితే రేపు కొండవస్తే ఏం చేస్తారండీ...నేనిలా అన్నానని ఏమీ అనుకో వద్దు...మనం యిద్దరం యించుమించు ఒకేరకం బాటమీద ప్రయాణం సాగిస్తున్న పధికులం...మన యిద్దరి ఆశయాల్లోనూ సామ్యం కనబడుతోంది...అందుకే చను వుగా చెబుతున్నాను నేను.' అంది.

'అయితే తప్పదంటారా ?...' పడ క్కుర్చీలో పడుకుని చాలా బేలగా అడిగాడు విద్యార్థి.

'ఎలా తప్పుతుందను కున్నారు ?... మీ యింటికి మీరే పెద్ద ... మీరే పెద్ద కొడుకు అంటున్నారు ... మీ అక్కగారిని తీసుకొచ్చి తొలిమాలు పురుడుపోసి సురక్షి తంగా పంపడం మీ బాధ్యత. మీ లక్ష్యసాధన కోసం బాధ్యతల్ని విస్మరించడం స్వార్థమే అవుతుంది. ఒకవేళ మీరు బాధ్యతల్ని తప్పించుకుని సంకల్పసిద్ధి సాధించినా అది మీవాళ్ళ త్యాగఫలితం అవుతుంది కాని మీ స్వయంకృషి ఫలితంకాదు ... లేవండి విద్యార్థిగారూ. యిల్లు చూడండి...' అంటూ లేచి చనువుగా విద్యార్థి చెయ్యి పట్టుకుంది జ్ఞానాంబ...

(ఇంకా వుంది)

# భారతీయ చిత్రకారులు

రచన, చిత్రాలు: కాలిపు సోమరాజు

## రసికరావల్ జననం : (1928)

శ్రీ రసిక దుర్గాశంకర రావల్ సౌరాష్ట్రంలో జన్మించారు. సాబర కాంటాలో వీరి బాల్యం గడిచింది. బొంబాయిలో కళాశిక్షణ గరిపేరు. జాతీయ సంస్కృతిపై వీరికి మక్కువ ఎక్కువ. అంచేత సౌరాష్ట్ర అలంకరణ శైలి యొక్క ప్రభావం వీరి చిత్రాలలో మనకు సాక్షాత్కరిస్తుంది. అయినా ఎన్ని చిత్రాల మధ్యనున్నా సరే వీరి చిత్రాల్ని మనం సులువుగా పట్టుకోగలం.

సహజ వస్తువు యున్నట్టుగా చిత్రాలు రచించలేరనేది సామాన్యంగా వినిపిస్తూ ఉంటుంది. కాని రావల్ చిత్రాలు అసలు వాటికంటె అందంగా ఉంటాయనేది సత్యదూరం కాదు. వీరి చిత్రాలపై ఆధునిక చిత్రశైలి యొక్క ప్రభావం కనిపిస్తున్నా భారతీయత వాటిలోంచి తొంగిచూస్తూ ఉంటుంది. 1954లో వీరి చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. బొంబాయి ఆర్ట్స్ సొసైటీవారి బహుమతి 1952 లోను, జాతీయ బహుమతి 1955 లోను వీరికి లభించేయి.

# పతివ్రత




డా॥ ముదిగొండ శివప్రసాద్

సౌందర్య, అలంకరణను కళ్ళప్పగించి చూస్తున్నది కనకమ్మ. ఆమెకు సౌందర్య ఏ పని చేసినా అపురూపంగానే అనిపిస్తుంది — కనిపిస్తుంది—

ప్రతి పనిలోనూ ఒక్కొక్క హొయలు ఒక్కొక్క సొగసు—నెక్లెస్ వెనుక కొక్కెం తగిలిస్తూ అన్నది కనకం 'అబ్బ – మీరీ చీరలో రంభలా వున్నారండమ్మగారూ'

ఈ పొగడ్త సౌందర్యకు తృప్తిని కలిగించ లేదు సరికదా కోపకారణమైంది—

'రంభ ఎవరే?'

'అదేనండమ్మా—'

'ఏది?'

'పౌరాణిక సినిమాల్లో చూపిస్తారే— అది'

'అంటే—'

'అందంగా వుంటే రంభలా వుందం టారు ఊర్వశిలా వుందంటారు—'

'మూర్ఖురాలా! వాళ్ళంతా దేవవేశ్యలు— ఉత్తములు వారితో పోలిక తెచ్చుకోకూడదు'

పుల్‌వాయిల్ చీర చెంగు జఘనాలను దాటేవరకు విడిచింది—

సంప్రదాయికంగా బొట్టును తీర్చి దిద్దుకున్నది—

అనంతరం భర్తనొక్కసారి స్మరించు కొని మంగళసూత్రాలు కళ్ళకద్దుకొని మేడకిందికి చూసింది—

మోహనరావు ఇంకా రాలేదు.

సినిమాకు టైం అయిపోతున్నది—

కనకం నిట్టూర్చింది—

ఆ నిట్టూర్పు చాలా బరువుగా వుంది—

ఇది మొదటిసారి కాదు నీ భర్త నిన్నిలా మోసగించడం అన్న అర్థం అందులో వుంది—

ఎన్నివుండి ఏం లాభం ఆయన సరిగ్గా టైం పాటించి వచ్చి ఆదరించనప్పుడు అని మరో భావం—

ఇదే నేనైతేనా ?— మాట తప్పితే ఆయన భరతం పట్టేదాన్ని అన్న మరో ధ్వనీ—

ఇలా ఆ నిట్టూర్పు చాలా మాటలను నిశ్శబ్దంగా చెప్పింది-సౌందర్య మాత్రం చాలా నిర్లిప్తంగా చిరునవ్వు నవ్వింది,

ఆకాశంలోని పున్నమ చంద్రుణ్ణి చూస్తూ—

టెలిఫోన్ మ్రోగింది—

కనకం తీసుకొని 'తీసుకోమ్మా అయ్యగారు పిలుస్తున్నారు' అన్నది—

సౌందర్య వెళ్ళి ఫోను తీసుకున్నది—

కనకానికి సౌందర్య చేసే ప్రతిపనీ వింతగానే కనిపిస్తుంది—

భక్తితో దేవాలయానికి అభిముఖంగా నడిచినట్లు నడుస్తుంది సౌందర్య ఎప్పుడు భర్త దగ్గరనుండి ఫోనువచ్చినా. భక్తురాలు దేవునితో మాట్లాడినట్లు మాట్లాడుతుంది సౌందర్య మోహనరావుతో ఫోనులో అయినాసరే—మోహనరావు చెప్పింది చెవులకు వినిపించక పోయినా కనకం సౌందర్యకన్నా స్పష్టంగానే ప్రతిమాటా మనస్సుతోనే విన్నది.

'సౌందర్యా! అర్జంటుపని తగిలింది—రాలేను. కావాలంటే నీవు కనకాన్ని తీసుకొని వెళ్ళు — లేదా రేపు వెళ్దాము ఇద్దరమూ.'

సౌందర్య ముఖంలో బాధ కన్పించలేదు—కోపమూ ప్రతిబింబించలేదు.

చాలా సామాన్యంగా ఫోను పెట్టేసివచ్చి సోఫాలో మళ్ళీ కూర్చొని అన్నది

'ఏమే నిన్న పనిలోకి రాలేదు—'

'చెప్పానుగదమ్మా పొద్దున్నే — ఏదో దెబ్బలాట—'

'ఎవరితోనే' నవ్వుతూ అడిగింది—

'ఎవడితో దెబ్బలాడితే ఎవడూరుకొంటాడమ్మగారూ — మావాడితోనే దెబ్బలాడాను—తిక్కరేగి చివరకు రెండు ఇచ్చుకున్నాను—దాంతో వాడితల తిరుగుడు తగ్గి నోరుమూసుకొని మళ్ళీ పనిలోకి పోయాడు'

ఆమె తలమీద పిడుగుల వర్షం కురిసినట్లు భావించింది.

కనకం తన మొగుడు సీసను నాలుగు తన్నింది—

భార్య భర్తను తన్నింది—

స్త్రీ పురుషునిమీద చెయ్యిచేసుకున్నది.

ఇంతపని జరిగినా ఈ సృష్టి ఎందుకు స్తంభించి పోలేదనిపించింది సౌందర్యకు.

ఇటువంటి నీచురాలు తన ఇంట్లో పనికి కూడా అనర్హమని అనిపించింది.

కాని గత్యంతరంలేదు—

కనకం తల్లితండ్రీ చనిపోతూ దిక్కులేని ఈ బిడను మోహనరావు తల్లికి పనిపిల్లగా అప్పగించి వెళ్ళారు.

'పనిపిల్లగానో—పిల్లగానో ఎలా చూసుకున్నా ఇకమీదే భారం' అని కన్నుమూశారు.

కనకం ఈ గోడలమధ్యే పెరిగింది—

కనకం పెళ్ళికి మోహనరావు తండ్రి విజయసారథి ధనసహాయం చేశారు—

పెళ్ళినాడు కుటుంబమంతా స్వయంగా ఆధ్వర్యం వహించి జరిపించారు—

శ్రీనివాసులుకూడా మంచివాడే!

కాని వాడికి మొదటినుంచీ తాగుడు అలవాటు వుంది — వస్తుకయితే కొంచెం చీట్లాటలోకూడా తగలేస్తాడు — కనకం కాపరానికి వచ్చినప్పటినుంచీ సీను ఈ స్వేచ్ఛను కొంత కోల్పోయాడు—

కనకం చాలా మనోనిబ్బరంకల మనిషి—

అందుకే ఏమీ చరించకుండా వాడిని చీట్లాడకుండా నిరోధించగలిగింది—

అందుకు డబ్బులు దొరకకుండా చేసింది—

కాని తాగుడు మాన్పించడం ఆమెకు సాధ్యపడటం లేదు — అందుకే ఈ దెబ్బలాట—

దెబ్బలాటంటే తాగి మొగుడు కనకాన్ని కొడతాడని సౌందర్య భావించేది—

కాని అది అసత్యమనీ ఈవిడే స్త్రీ జాతి మొత్తం తరతరాలుగా అవమానించుకునే పని చేస్తున్నదనీ సౌందర్యకిప్పుడే అర్థమైంది—

సౌందర్యకు కనకం సేవను స్వీకరించే అర్హతేకాని దాన్ని పనిలోనుండి తొలగించేటంత అధికారంలేదు—అందుకే ఊరుకున్నది.

ఊరుకున్నదంటే కనకాన్ని వెళ్ళగొట్టకుండా ఊరుకున్నది అంతేకాని మాట్లాడకుండా ఊరుకోలేదు.

నీతిబోధ చెయ్యకుండా విరమించలేదు—

కనకం సౌందర్య చెప్పిన మాటలన్నీ భక్తిశ్రద్ధలతో విన్నది—

సౌందర్య కనకానికి సుమతి కథ చెప్పింది—అరుంధతి పుణ్యగాథను విశదీకరించింది—పాముగా వున్న భర్తను ఆ బుట్టలో పెట్టి నెత్తిన పెట్టుకొని తీర్థాలు క్షేత్రాలూ మొత్తం దర్శించిన పుణ్యాత్మురాలి దివ్యగాథను గానం చేసింది—

కనకానికి ఈ కథలన్నీ కొత్త—

ఆశ్చర్యపోయి అన్నది 'అమ్మగారూ—వాళ్ళంతా దేవుళ్ళోళ్ళు — మనం మామూలు మనుషులం — మట్టి బొమ్మలం'

'అజ్ఞురాలా—వాళ్ళూ మనలాంటి మనుషులే—ఇంకా నీకన్నా వతవళ్ళకి కలిగోరూ వారికి పాతివ్రత్యమే వ్రతం — అదే వారి తపస్సు అందుండి వచ్చిన అగ్నికి సూర్యుడు గజగజ వణికి స్తంభించిపోతాడు. గ్రహాలూ ప్రకృతి భగభగ భస్మీభూతమై పోతుంది — కనకం ఇలాంటి స్త్రీ జాతిలోనా నీవు పుట్టావు? సీనుతాగితేతాగుతాడు మొగవాడు తాగుతాడు తిరుగుతాడు, వాడు మొగమహారాజు—మొగుడు, అడిగేందుకు నీకేం అధికారముంది?'

ఈ మాటల వెనుకవున్న మనస్తత్వం కనకం గ్రహించింది—

మోహనరావు క్లబ్బులో కొద్దిగా పుచ్చుకుంటాడు. చీట్లాడుతాడు—తన ఆఫీసులో పనిచేసే టైపిస్టుతో సినిమాకు వెళ్ళడం కూడా రహస్యమేమీకాదు.

అయినాసరే సౌందర్య కోపగించదు—

ఈ చిన్న చిన్న విఘ్నాలు ఆమెకు తపోభంగాన్ని కల్గించవు. ఋషులు తపస్సు చేస్తుంటే దేవేంద్రుడు అప్సరలను పంపి అవరోధాలు కల్పించేవాడట — ఇలాంటివే తన తపశ్శక్తిని పరీక్షించడడకోసం పరమేశ్వరుడు కల్పించాడని భావించింది సౌందర్య—

భర్త దక్షిణ నాయకత్వం తన ఆరాధనకూ తాదాత్మ్యతకూ ఏమీ అవరోధం కలిగించలేదు — కనకం సౌందర్య తనకు చెపుతున్న నీతులు విన్నప్పుడు ఈ విషయాలన్నీ స్ఫురించాయి—సౌందర్య దేవత!

ఆమెలో మానవాతీత శక్తులేవో వున్నాయి—

కాబట్టే ఆమె ఇలాంటి కఠినమైన వ్రతాన్ని నిర్వహించ గలుగుతున్నదని కనకం భావన—

అమాటే అన్నది 'అమ్మా మీరు దేవతలాంటివారు— నేనో అలగాదాన్ని—పనిచేసుకొని బతికే మామూలు మనిషిని'

సౌందర్యకు కనకం సమాధానం తృప్తినివ్వలేదు—

ఆ క్షణంలో చంద్రుడు మరికొంచెం పైకివచ్చి వెండితీగెలవంటి తన కిరణాలను అమృతంలో తడిసి భూమ్యాకాశాలమధ్య ఒక అనుబంధాన్ని నిర్మిస్తున్నాడు—

ఆకాశంలోని చంద్రునిలా మెరిసిపోతున్న సౌందర్య భూమిపై తన కాళ్ళదగ్గరే కూర్చున్న కనకంతో అన్నది.

'కనకం చూడు—విధికి మనం కర్తలం

కాము—అదంతా దేవుడి చేతిలోనే వుం టుంది—కేవలం మన ధర్మాన్ని నిర్వహించ డమే. మన బాధ్యత—నాకుమాత్రం బాధలూ భయాలూ లేవంటావా ? కాని నేను నీలాగా బుద్ధిహీనురాలినిగా ప్రవర్తిస్తున్నానా ?'

కనకం ఆశ్చర్యపడ్డది.

తనకూ సౌందర్యకూ పోలికా ?

నిజం చెప్పాలంటే సౌందర్యకు ఏలో పమూ లేదు ఆర్థికంగా బాగానే—వుంది వారిస్థితి.

ఓ ఎయిర్ కూలర్, ఫ్రిజ్, మొజేయిక్ ఫ్లోరింగ్ గదుల్లో ధగధగ మెరిసే వెండి గిన్నెలా స్టీలు సామాన్లూ డెకొలమ్ వేసి ముట్టుకుంటే మాసిపోయేటట్లుండే డ్రైసింగ్ గదుల్లోని కాంతులూ.

లేటెస్టు మోడల్ కార్.

డ్రైవర్—పనిమనిషీ—వంటమనిషీ—

సౌందర్యకు భౌతికమైన సిరిసంపదల్లో ఏలాంటి లోపమూ లేదు—

భర్తను చూద్దామంటే అతిలోక సుందరుడు కాకపోయినా అనాకారి మాత్రం కాదు—

ముఖ్యంగా మొగవాడికి అందమైన విద్య వుంది—

భార్యంటే ఎంతో ప్రేమ—

దాన్నిమించిన గౌరవం—అభిమానం—

ఇక ఆమె సంగతి చూద్దామంటే అక్షరాలా ఏడువారాల నగలూ బండెడు టెర్లిన్ ఫారిన్ నైలెక్స్ చీరెలతో రతీదేవి

# పతివ్రత

లా నవశాన భూమిమీద సాకారంగా నడు స్తున్నదా అన్నట్లుండేది—

అలాంటిది, తనకూ సౌందర్యకూ పోలికేమిటి ?? ఒకపూట తింటే రెండో పూట పిల్లలకు గంజి దొరుకుతుందనే కనీసపు హామీకూడా లేని తన జీవితానికి పాతివ్రత్యమూ, దానిద్వారా తపశ్శక్తిని సాధించడం సాధ్యమా ?

కేవలం పురాణాల్లోని కథలవలె విని ఆనందించి అశ్రువులు రాల్చవలసిందే !!

అందుకే కనకం అన్నది 'ఈపాతివ్రత్య వ్రతం అందరికీ అందుబాటులోలేని అంగని. మానుషం అమ్మగారూ — నీవంటి అదృష్టవంతులూ పెట్టిపుట్టిన వారే చేసేవ్రతం ఇది.'

కనకం స్కూలుచదువు చదువుకోక పోయినా సాంస్కృతికమైన విజయసారథి గారి కుటుంబ వాతావరణంలో పెరిగింది—కాబట్టి భావాలకూ భాషకూ ఆమెకు లోటులేదు—

ఈ మాటతో సౌందర్యకు కోపం వచ్చింది—

'వెర్రిమొగమా — మహాకార్యాలు సాధించ డానికి పెద్దపెద్ద పరికరాలూ సాధనాలు లేకుండానే మహాత్ములు పురోగమిస్తారు—విజ యాన్ని పొందుతారు — కనకం నాకంటే నీకు ఆర్థికంగా పెద్ద స్థితిగతులు లేక




పోవచ్చు కాని భర్త అనురాగంలోనూ ఆత్మీయతలోనూ లోపం ఏమన్నా వుందా ? అలాంటప్పుడు నీ శక్తి వంచనలేకుండా మన్నాయన్ను పువ్వుల్లో పెట్టి పూజించడం మానేసి నాతో వాదిస్తున్నావు సిగ్గు లేదా—'

తనకు నిజంగా సిగ్గులేదనే అనిపిం చింది కనకానికి. కాని ఏం చెస్తుంది ? తనకలా పట్టుచీరెతో తలసికోటకు భర్త సౌభాగ్యాన్నికోరి పూజచేయడం చేతకాదు. పాదతీర్థం పుచ్చుకోవడం ఎరుగదు.

సౌందర్యకు బిడ్డలు లేరు—

తనకలాకాదు ముగ్గురు బిడ్డలున్నారే. ఆ సీనుగాడు డబ్బు పేకాటకూ తాగు డుకూ తగలేస్తే వారి గంజిమాటేమిటి?

కేవలం మోహనరావుగారింట్లో తన తిండి వెళ్ళితే సరా?

బిడ్డలు అల్లో లక్ష్మణా అని అల్లాడు తుంటే తనకెలా మనశ్శాంతి లభి స్తుంది?

మొగుడి నైచ్యాన్ని ఎలా సహించి వూరుకొంటుంది?? అందుకే సీనుగాడికి నాలుగు తగిలిస్తుంది—

'దొంగ నెధవా — నువ్విట్లా తాగుడు మానెయ్యకపోతే నేను మారుమనువు చేసు కొంటానని' బెదిరిస్తుంటుంది — నిజానికి అది జరిగేదీ, పొయ్యేదీ కాదని ఇరువురికి తెలుసు—

అయినా కనకానికి అంతకంటే చేతిలో వేరే ఆయుధాలు ఏమున్నాయి ?

ఉన్నవన్నీ శక్త్యనుసారం ఒకదాని తర్వాత ఒకటి ప్రయోగిస్తుంది — ఏడు స్తుంది—రభస చేస్తుంది—.

నలుగురినీ పిలిచి బజారులో పంచాయితి పెట్టి మొగుణ్ణి నేరస్థుణ్ణిగా ఉరిశిక్ష వేయదగ్గ ముద్దాయిగా నిరూపిస్తుంది —

బుద్ధిలేని జనమంతా పని మానుకొని ఈ ఉచిత వినోదాన్ని తిలకించి కనకాన్ని నాలుగుమాటలూ సీనుగాణ్ణి పరోనాలుగు కూతలుకూసి ప్రతిఒక్కరూ ఒక న్యాయ నిర్ణేతల్లా తమతమ జడ్జిమెంట్ ఈ పంచాయితీమీద పాస్‌చేసి వెళ్తారు—

అంతటితో ఆ ఘట్టం సమాప్తం —

మళ్లీ మర్నాడు ఇలాంటి మరొకటి తయారు—

అందుకే కనకం అనుకున్నది— అన్నది

కూడాను—

'మీ పాతివ్రత్యత వ్రతం నాకు ఈ జీవితంలో అసంభవం అమ్మగారూ — అందుకు దేవుడు నన్ను నరకానికి పంపినా సరే — ఇనుపకాకులతో పొడిపించినా సరే.'

* * *

గోవిందరావు మళ్ళీ వచ్చాడు.

తలుపు తట్టాడు.

కనకం లోపల వంటపనికి సహాయపడుతున్నది—

సౌందర్య తానే స్వయంగా వెళ్ళి తలుపు తీసింది.

కళ్ళు ఎర్రగా వున్నాయి—

ఎక్కడినుంచి వచ్చాడు ? ఎందుకు వచ్చాడు ?

ఇవన్నీ అడిగే అధికారం సౌందర్యకు లేదు.

చెప్పవలసిన అవసరమూ గోవిందరావుకు లేదు—

నేరుగా లోపలికి నడుస్తూ అడిగాడు.

'తమ్ముడు లేడా ?'

'ఇంట్లో లేరు.'

'ఎప్పింటికి వస్తాడు.'

'తొమ్మిది దాటుతుంది'

'మంచిది — అయితే నాకు ముందే వడ్డించండి—ఆకలవుతున్నది'

సౌందర్య కనకాన్ని పిలిచి బావగారికి కావలసిన సౌకర్యాలన్నీ చేయమని చెప్పి తన గదిలోకి వెళ్ళింది—

గోవిందరావు ఎవరికోసమూ ఎదురు చూడకుండానే షడ్రసోపేతమైన భోజనం ముందు తానే ముగించాడు—

భోంచేస్తూ మధ్యలో తలెత్తి కనకాన్ని ప్రశ్నించాడు 'అమ్మాయి ఏదీ'

'గదిలో వున్నారండీ'

'ఓహో — వంట చాలా బాగుందని చెప్పు—' చెయ్యి కడుక్కొని మేడపైకి వెళ్ళి ఆరుబయట కూర్చున్నాడు.

కనకం పాన్‌దాన్ ఎదురుగా ముందు పెట్టింది—

ఆకులు వక్కలు నములుతూ అలా శూన్యాకాశాన్ని చూస్తూ కూర్చున్నాడు గోవిందరావు—

గోవిందరావు వచ్చాడంటే సౌందర్యకు భయం —

ఎప్పుడు వచ్చినా సరే ఆయనకు అవసరం వేల సంఖ్యలోనే వుంటుంది. మోహనరావు మారు మాట్లాడకుండా ఇచ్చి పంపుతూనే వుంటాడు—

ఈసారి మళ్ళీ ఎందుకొచ్చాడో ?

ఎంత తీసుకుపోతాడో ??

అయినా సౌందర్య ఎన్నడూ భర్తని విషయం అడగలేదు — అవిభక్త కుటుంబంలో తాను జోక్యం కలుగజేసుకోవడం ఆదర్శాలకే విరుద్ధం అనుకున్నది.

అప్పుడప్పుడూ ఇంకా కనకమే అంటుండేది చూచాయగా మోహనరావుతో—

అయితే కనకం మాటలకు మోహనరావు గడ్డిపరక కిచ్చిన విలువకూడా ఇవ్వలేదు.

* * *

విజయసారథి మంచి స్థితిపరుడు.

బాగా పలుకుబడి కల మనిషి—

లేకలేక అపురూపంగా చాలా ఆలస్యంగా గోవిందరావు కలగడంతో ఆ పిల్లవాణ్ణి అల్లారుముద్దుగా పెంచారు—

ఫలితంగా గోవిందరావుకు చదువు సంధ్యలు అబ్బలేదు—ఎప్పుడూ చీట్లాటా క్లబ్బులూ తాగుడూ—ఇలా తయారైనాడు.

గోవిందరావు పుట్టిన నాలుగేండ్లకే మోహనరావు పుట్టాడు. కాని మోహనరావు ముద్దూ ముచ్చటలు చూచుకునే అదృష్టం వరలక్ష్మమ్మకు ఎక్కువకాలం లేకపోయింది—

'ఇటు భార్యపోయిన విచారం; అటు పసిపిల్లవాణ్ణి సాకి పెంచి పెద్దచేయడం ఎలా?' అన్న దిగులూ విజయసారథిని బాగా కుంగదీశాయి—

కనకం మోహనరావుకన్నా కొంచెం పెద్ద గోవిందరావుకన్న చిన్న—

కనకం తల్లిదండ్రులు కూడా వాళ్ళింట్లోనే చాకిరీ చేసుకొని బతికేవారు—

వాళ్ళు కన్నుమూస్తూ 'కనకాన్ని' వరలక్ష్మమ్మ చేతిలో పెట్టి పోయినందుకు గాను సొంతకూతురి లాగానే పెంచింది వరమ్మ కనకాన్ని.

అందుకు కృతజ్ఞతా సూచకంగానా అన్నట్లు వరమ్మ కన్నుమూశాక మోహనరావు పెంపకంలో కనకం ఎంతో శ్రద్ధ కనపరచేది—

తన వయస్సుకు మించిన శక్తిని పుంజుకొని తమ్ముడిలా పెంచి పెద్దచేసింది— తానూ ఒకవైపు పెద్దదవుతూ—

గోవిందరావు విద్యావంతుడైతే కొంత బాగుపడతాడేమోనన్న భావంతో విజయసారథి అతన్ని చదువులో ప్రవేశపెట్టాడు— ఇంటిదగ్గర ముగ్గురు టీచర్లను పెట్టాడు కాని నీటిపై వ్రాసిన అక్షరాల్లా విద్య అతనికి అబ్బలేదు — చదువువల్ల సంస్కారాలు పెరగకపోగా జులాయి వెధవల సాంగత్యం పట్టుబడి సానికొంపలకు వెళ్లడం మొదలుపెట్టాడు—

దీనికి ప్రతిక్రియగా పెండ్లిచేశాడు;



కాని ఈ వర్షాకాలపు వెల్లువను శాంత నిరికపోచలా ఆపి వుంచలేకపోయింది—

ప్రవాహ వేగానికి వంగిపోయింది—

లావరీక్షలో 'అన్‌లాఫుల్ యాక్టివిటీ'కి దిగినందుకుగాను డీబార్ చేశారు గోవిందరావును.

అంతటితో అతని విద్యాజీవితానికి శాశ్వతంగా స్వస్తి.

'పీడా వదిలింది' అనుకొన్నాడు దీనితో—

జీవన్ముక్తి దొరికిన యోగిలా ఈ విద్యాబంధాలనుండి బయటపడ్డట్లు ఆనందించాడు—

విజయసారధికి తానింక ఎక్కువకాలం జీవించనని తోచింది—

మోహనరావును పిలిచి 'నీవు ప్రయోజకుడివి— బుద్ధిమంతుడివి. అన్న సంగతి తెలిసిందేకదా! అందుకే వాడిచేతుల్లో నిన్ను పెట్టిపోవలసింది పోనిచ్చి నీ చేతుల్లో వాడిని అప్పగించి వెళ్తున్నాను — మీ గొంతుల్లో ఊపిరి వున్నంతవరకు విడిపడకండి—ఒకరి నాశ్రయించుకొని ఒకరు బ్రతకండి—' అని చెప్పి అప్పగింతలు జరిపి ఆ తర్వాత సౌందర్య వచ్చాక కొంత కాలానికి కన్నుమూశారు—

ఒకరి నొకరు ఆశ్రయించుకోవడం అనే మాట కేవలం లాంఛనప్రాయమైనదే—

గోవిందరావును ఆశ్రయించుకొని మోహనరావు పనిచేయించుకొన్న క్షణాలు చాలా తక్కువ—

మోహనరావు తన పలుకుబడి నుపయోగించి గోవిందరావుకొక ఉద్యోగం ఇప్పించాడు కాని అందులో అతను చేసిన అక్రమాలవల్ల గోవిందరావు ఉద్యోగం పోవడమేకాదు వాటిని సరిదిద్దేసరికి మోహనరావు తల ప్రాణం తోకకువచ్చింది—

ఇదంతా చూచి ఒకరోజు గోవిందరావు అన్నాడు. 'తమ్ముడూ నావల్ల నీవెంతో శ్రమపడుతున్నావు. అందుకు చిన్నవాడివైనా నేను నిన్ను క్షమించమని కోరుకుంటున్నాను. ఇద్దరికీ పెళ్లిళ్లయినాయి—ఇక సంసారాలు పెరుగుతాయి — ఒకరిమీద ఒకరు బరువు బాధ్యత ఉంచుకోవడం మంచిదికాదు— పంపకాలు చేసుకుందాము—ఎవరికి వచ్చిన దానితో వాళ్లు వేరువేరుగా సంసారాలు చేసుకుందాము.'

# పతివ్రత

మోహనరావుకు విజయసారధి కళ్ళముందు మెదిలాడు. ఆయన చేతిలో తాను చెయ్యి వెయ్యడం ఓచితంలా కళ్ళకు కట్టింది—నిగ్రహంతో అన్నాడు.

'అన్నయ్యా మంచికో చెడుకో అవి భక్తంగా వున్నాము — ఇప్పుడు వేర్లుపడితే నలుగురూ నాలుగు మాటలంటారు— అయ్య తండ్రిపోగానే భార్యలు వచ్చి కొడుకులను వేరుచేశారని అంటారా—సమాజానికి అకవాలు వినడానికి చెవులూ, అనడానికి నోరూ మాత్రమే ఇచ్చాడు దేవుడు— హృదయం సమిష్టికి చాలా తక్కువగా వుంటుంది — విడిగా ఒక్కొక్కడూ ఉత్తముంగావున్నవాడే, సామూహికంగా మందిలో నిలబడ్డాడనుకో కొన్ని సందర్భాలలో వాడిలో సమిష్టి చైతన్యం వికసిస్తుంది. (మాస్ మెంటాలిటీ) అప్పుడు వాడు పశువుగా

## బాల్యం

బాల్యం ఒక పవిత్ర స్వర్గం
అహర్నిశం చింతలు లేని జీవితం—
ఆటలు— పాటలు
ఎగరడం— దూకడం
తోచింది చేయడం
అనుకున్నది చెప్పడం
అబద్ధాలకు అన్యాయాలకు
అర్థం తెలియక పోవడం—
ఉపకారంవల్ల ఒరిగే మేలు
అపకారంవల్ల కలిగే హాని
అంతు పట్టకుండడం
ఇది కావాలనీ— అది లేదనీ
ఇంటిలోని పోరు
ఇల్లాలి బంధం— అనే
విచారం లేకపోవడం—
వ్యాపారం నష్టమనీ
ఉద్యోగం ఊడిందనీ
అప్పుల వాళ్ల గొడవలనీ
పన్నులవాళ్ల బాధలనీ
అసలే లేక పోవడం.
అంతా ఒక ఆనందమయమైన స్వప్నం!
ఊహించలేని అమాయకపు స్వర్గం!
కాని—
చేయి జారిపోతుంది బాల్యం
చెప్పకుండా అది స్వర్గమని తెలిసేటప్పటికే.

—ఎల్. మాలకొండయ్య

మారే అవకాశాలుకూడా లేకపోలేదు — పది నోళ్ళతో తన నోరు కలిపి ఉచితానుచితాలు లేకుండా తిడతాడు.'

మోహనరావు చెప్పింది నిజమేకాని పూర్తి సత్యంకాదు—సమిష్టి చైతన్యం పశుత్వం వైపుకేకాదు పరమేశ్వరత్వం వైపుకు కూడా నడువవచ్చు.

విడిగా పశువుగా వున్న వ్యక్తి అసంఖ్యాకమైన ఉత్తముల మధ్య నిలబడ్డప్పుడు తానూ ధర్మపన్నాలు చెపుతాడు. సత్యాన్ని ఉపాసిస్తానని ప్రమాణాలు చేస్తాడు.

ఈ చర్య మాట ఎలా వున్నా ఆస్తికి సంబంధించినంతవరకు అన్నతమ్ములు విడిపడలేదు—

మోహనరావు తండ్రిమాటకు కట్టుబడ్డాడన్న సంగతి తెలియని శాంత దీన్ని మరిది బలహీనతగా భావించి సాధ్యమైనంత అతన్ని దోచుకోవాలని నిశ్చయించుకుంది—

'విడిబడితే ఏముంది ? ఆ వున్న నాలుగు డబ్బులూ భార్య రంగురంగుల చీరెలకూ నగలకే చాలవు—అందుకే ఈ దొంగ నాటకమూ ఆ సౌందర్య ఎరగబాటునూ—ఎవరికి తెలియని భాగోతమిది—మనలాగా పొదుపుగా చేసుకునే సంసారమయితేనా ? ఎంత ఉద్యోగముంటేనేం చిల్లికుండలో నీళ్లు పోసినట్లు'—అని మొగుణ్ణి రెచ్చగొట్టింది —ఫలితంగా గోవిందరావూ శాంతలకు పైతృకమైన ఇంటిని వదిలివేసి మోహనరావు వేరే అద్దె ఇంట్లో వుంటున్నాడు. ఆస్తిపై ప్రతిసంవత్సరమూ వచ్చిన ఆదాయం చెరిసగమూ పంచుకొంటారు—

అయితేనేం ఉద్యోగంలేని గోవిందరావుకు ఈ డబ్బులు చిల్లపెంకుల్లా ఖర్చైపోవడానికి ఎంతకాలం పట్టాలి ?

అందుకే తమ్ముడిఇల్లు ఒక ఖజానాగా భావించి ఎప్పుడుపడితే అప్పుడు వస్తాడు.

ఇచ్చినంత తనకు నచ్చినంత గుంజుకొనిపోతూవుంటాడు మధ్యమధ్య—

* * *

సౌందర్యకు మెలకువ వచ్చేసరికి తీవ్రంగా మాటలు వినపడుతున్నాయి—

'అయ్యగారూ మీరాయనకు ఒక్క పైసాకూడా ఇవ్వడానికి వీలులేదు— అమ్మ వూరుకొంది కదా అని నేనూరుకోను—' గోవిందరావు ఖిన్నుడైపోయాడు—

'ఛీ! వెధవ బ్రతుకు — చివరకు పని

మనిషిచేత కూడా మాటలనిపించుకోవలసి వచ్చింది— ఇంతకన్నా చావడమే మంచిది.'

'అంత బుద్ధేవుంటే చావడమెందుకు? తాగుడూ తిరుగుడూమాని బుద్ధిగా ఉద్యోగమే చేసుకోవచ్చుగా — జలగలా మమ్మల్ని పీడించడం దేనికి?'

మోహనరావు ఉద్రేకంలో కనకాన్ని ఫెడీఫెడీ మని కొట్టాడు — కనకంపై మోహనరావు చెయ్యి చేసుకోవడం ఇదే మొదటిసారి—

'అమ్మగారు పతివ్రతకదా అని అలుసు తీసుకొని అన్యాయం చేస్తుంటే అడ్డం వచ్చినందుకు మంచిగానే చేశారు అయ్యగారూ — నాకు తన్నులు పడవలసిందే—' ఏడుస్తూ గది విడిచి వెళ్ళింది కనకం—

మోహనరావు దుఃఖితుడైనాడు — అతని మనస్సు క్షోభించిపోయింది — చిన్నదగా కనకంపై చెయ్యిచేసుకోలేదు తన చిన్నప్పటినండి.

కాని ఇవ్వాళ ఇలా...

మాట్లాడకుండా ఇనస్పెట్టిలోంచి పది వందరూపాయల నోట్లు తీసి ఇచ్చి 'అన్నయ్యా ఇవి తీసుకొనివెళ్ళు' అన్నాడు

'చాలవు — పదిహేనువందలు కావాలి.'

ఈ వెయ్యి రూపాయలూ తన సంపాదనలోంచే ఇచ్చాడు మోహనరావు—

ఇంకా మరో అయిదువందలుకూడాను— మారుపలకకుండా మరో అయిదువందలు కూడా తీసి ఇచ్చాడు—రెండు చేతులూ ఎత్తి నమస్కరించి 'అన్నయ్యా డబ్బు ఇక దుబారా చెయ్యకు — నేనీ ఖర్చు భరించలేను—ఇక మళ్లీ నాదగ్గరకు రాకు—'

పదిహేను వందలు ఇచ్చినా తన దగ్గరికి రావద్దన్నమాట శూలంలా గుచ్చుకొంది గోవిందరావుకు—

'ఇదేదో ముష్టిలా నాకివ్వకపోతే, ఆ పొలాలూ ఫిక్సెడ్ మొత్తాలూ పంచుకుంటే సరిపోదూ—'

నిమిషానికొకసారి గోవిందరావూ శాంత తన నిజాయితీని బ్లాక్ మెయిల్ చేస్తున్నారు — ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నారు— తండ్రికిచ్చినమాటను నిలబెట్టుకోవాలనే తన పదర్శాన్ని బలహీనతగా భావించి తన్ను వంచిస్తున్నారు—

మోహనరావు ఇక భరించలేకపోయాడు 'అలాగే అన్నయ్యా రేపే రామకృష్ణకు కబురుపెట్టు — ఏవరిదివారు పంచుకొందాము'

రామకృష్ణ వాళ్ళ ఇంటి వకీలు—

తమ్ముడు పంపకాలకు ఒప్పుకుంటాడని గోవిందరావు కలలోకూడా అనుకోలేదు— అందువల్ల ఆమాట అతనికి నీరులేని మేఘంనుండి నిప్పురవ్వరాలినట్లు తోచింది—

ఒక్కక్షణం అప్రతిభుడైపోయినాడు — పంచుకొంటారు—

గోవిందరావు ఆస్తి గోవిందరావుకు వస్తుంది—

మొత్తం కొన్నేళ్లు హాయిగా ఖర్చు చేసుకోవచ్చు. ఆ తర్వాత అయినా తమ్ముడు తనకు డబ్బివ్వకపోకాడా మళ్లీ—

తాను తిండికిలేక భికారిగా తిరుగుతుంటే అది మోహనరావుకుమాత్రం ఏమి గౌరవం?

కాబట్టి పంపకాలు అయినతర్వాత కూడా తనకు తమ్ముడు ఉద్యోగం చేసి రెండు దోసెళ్ళతో సంపాదించినదాన్ని ముట్టచెప్పకుండా ఊరుకోడు.

అలాంటప్పుడు పంపకాలు తనకు మంచిగానే తోచింది— తల ఊడించి మాట్లాడకుండా మెట్లు దిగాడు—

సరిగ్గా గోవిందరావు ఏమనుకున్నాడో అదే అనుకొన్నాడు మోహనరావు—





# పతివ్రత

వెంపకాలు - అయినా - తర్వాతకూడా తన్ను పీడించక మానదు.

తాను ఇవ్వక తప్పదు—

ఇవ్వడూ, తండ్రి అమ్మకు శాంతి లభి స్తుందా పెద్దకొడుకు తిండికిలేక తిరుగు తుంటే?

నీతికీ వాస్తవానికీ మధ్య జరుగుతున్న సంఘర్షణలో మోహనరావు తట్టుకోలేక పోయాడు—

గోవిందరావు వెళ్ళాక సౌందర్యవచ్చి భర్తను భోజనానికి రమ్మన్నది—

'వెళ్ళు— నా కాకలిగాలేదు' విసుక్కు న్నాడు—

సౌందర్య మాట్లాడకుండా తన గది లోకి వెళ్ళింది—

కనకం పక్కకూడా లేకుండా అలాగే నేలమీద ఓమూల పడుకున్నది కన్నీరు చెంపల పైనుండి జారగా—

* * *

తెల్లవారింది.

సౌందర్య బ్రతుకు తెల్లవారింది—

అంతా తలో మాట, తలో ఆరోపణ తలో క ఫిర్యాదు—

'మార్ఫియా మింగే పోయాడు—'

'ఏడిశావు—స్లీపింగ్ పిల్స్ మాత్రలతో పోయాడంటే నాకు నమ్మకంలేదు — ఆ గోవిందరావే డబ్బివ్వలేదని ఏదో చేసి వుంటాడు—'

'ఎంతఘాతుకం—ఎంత అక్రమం—'

'రామలక్ష్మణుల అనురాగం కేవలం కథల్లోనేకాని లోకంలో వున్నదంతా రావణాసురుడూ విభీషణుడేనయ్యా' ఎన్నో వ్యాఖ్యానాలు—ఎన్నో విమర్శలు — పరామర్శలు.

సౌందర్య ఏడుస్తున్నదా ?

కన్నీటి ప్రవాహంలో ఆమె బుద్ధి మనస్సు ఆత్మ కొట్టుకొని పోయాయా? హృదయాగ్నికి దహనమై బూడిదగా మారాయా ?

ఏమో!

ఎవరికి తెలుసు—

కనకం పరీక్షించి చూచి ఆమె సజీవంగానే వున్నదని నిశ్చయించుకున్నది—

పతివ్రతలు భర్త మరణవార్త వినగానే ప్రాణత్యాగం చేస్తారని కథల్లో విన్నది—

సౌందర్య చెప్పడమూ గుర్తున్నది—

కాని సౌందర్యకు ప్రాణం పోలేదు—

ఇది కలియుగం—

ధర్మం ఒంటిపాదంమీదనే నడుస్తున్నది.

లేకుంటే సౌందర్య ఇంకా సజీవంగానే వుండటమేమిటి??

ఇప్పుడూరుకుంటే సర్వనాశన మవుతుం దని కనకం నిశ్చయించుకున్నది—

తన కర్తవ్యం ఆమెను వెన్నుతట్టి లేపింది—

లేచి సౌందర్యను ఊరడించింది—

అందుకేమి చెప్పిందో ఎలా చెప్పిందో ఏకథకుడూ వర్ణించలేనంత నైపుణ్యం ఏం ప్రదర్శించిందో ఎవరికి తెలుసు ?

సౌందర్య లేచి కూర్చున్నది—

మూర్తీభవించిన శోకదేవతలా లేచి నిలబడింది.

జీవచ్ఛవంలా లేచి నడిచివెళ్ళింది భర్త శవం వద్దకు.

ఈ లోపల డాక్టర్లు రావడం శవ పరీక్ష చేయడం స్లీపింగ్‌పిల్స్ ఎక్కువ కావడంతో ఆత్మహత్య చేసుకున్నాడని రిపోర్టులు రావడం శవాన్ని తిరిగి బంధువుల కప్పగించడం అంతా జరిగాయి—

మోహనరావు దేహాన్ని ఇంటికి తెచ్చారు.

ఈ లోపలే లాయరుతోసహా శాంతా గోవిందరావు వచ్చి కూర్చున్నారు—

ఆస్తిపాస్తుల వివరాలు అడుగుతు న్నాడు లాయరు రామకృష్ణ.

కనకం జవాబు చెప్పింది 'రామకృష్ణ గారూ దీనికిది సమయంకాదు — దయతో దహనకాండ ఆ పన్నెండు రోజుల వ్యవహారమూ ముగియనివ్వండి—'

'అలా వీలులేదు — భర్తకు ఘనంగా అంత్యక్రియలు జరగాలనే నెపంగా ఆస్తంతా సౌందర్య ఖర్చుచేసేస్తే మా గతి ఏం కావాలి? ఆ ఉన్నదేదో ముందు నగదూ బంగారం తేలనివ్వండి' శాంత అన్నది.

'ఏమీలేదు—మీ కిక్కడ ఒక్క దమ్మిడీ ఆస్తి లేదు — నోరుమూసుకొని వెళ్ళడం మంచిది' కనకం రోషంతో బదులిచ్చింది.

'ఇది మా ఇంటి వ్యవహారం — మధ్యలో పని మనుషులూ, దాసీవాళ్ళూ కలుగజేసుకోవడం మాకు పరువు తక్కువ' శాంత గద్దించింది—

శవాన్ని బయటపెట్టి వాటాలు పంచుకునే మీకు పరువుకూడా ఒకటి వున్నదన్నమాట'

కనకం అన్న ఈ మాట దోసెడు నిప్పులను రాల్చింది.

రామకృష్ణ అందుకున్నాడు 'అమ్మాయ్ సౌందర్యా— నువ్వు మాట్లాడమ్మా—'

సౌందర్య వచ్చింది — కాని మాట్లాడ



లేదు—

మాట్లాడడానికి ఆమెలో ఇంకా ఇంద్రియజ్ఞానం ఉన్నదో లేదో?

'చూడమ్మా—మీరు వేరువేరు ఇళ్ళల్లో వున్నా చట్టం దృష్టిలో అవిభక్త కుటుంబం కిందనే లెక్క — అందుకనే స్థిరాస్తులు చరాస్తులూ కలిసి లెక్క చూడాల్సిందే—'

'బావగారింటినుంచివస్తున్నారా?' ఆయన చివరకు ఇలా ప్రేరేపించాడా అని ఒక భావం — మా ఆస్తి లెక్క చూడడానికి వచ్చావు మరి ఆయన ఇంటిని సీలుచేసి వచ్చారా ? అని మరొక అర్థం—

బావతో కలిసివచ్చిన వాడివి ఆయనకన ఉదాత్తమైన గుణాలు ఎలా వస్తాయి ?, అని ఇంకోధ్వని—

ఇన్ని స్ఫురింపాయి సౌందర్య అన్న ఆ చిన్న మాటలోనూ గోవిందరావుకు — కాంతకు — రామకృష్ణ కు —

సౌందర్యే మళ్ళీ అన్నది 'ఉన్న స్థిరాస్తి తెలిసిందే — భాగాలు పంచండి తర్వాత — చరాస్తి అంటూ ఏమీలేదు ఆయన, ఉద్యోగంచేసి సంపాదించిన ఈ సామాను మినహాయిస్తే—

'అది కాదమ్మా — రొక్కమూ బంగారమూ వగైరా'

'అలాంటి వేవీ లేవు—'

నిర్ఘాంత పోయాడు గోవిందరావు—

'అబద్ధం — ఏడువారాల నగలుండాలి— బోలెడంత కాష్—వెండి సామాను'

సౌందర్య తలెత్తి ఒక్క చూపు చూచింది—

ఆ చూపుకు రుద్రుని మూడోకంటి వేడే వుంటే గోవిందరావు బూడిదిగా మారేవాడే ఇప్పుడో—

'ఛీ నీచుడా! తమ్ముడి స్వార్జితంతో మరదలికి పెట్టిన బంగారాన్ని భాగాలకు పంచమనివచ్చావు నీవు మనిషివేనా' అని కొరడాతో చెళ్ళున వీపుపై మోదినట్లనిపించింది ఆ చూపులతో గోవిందరావుకు—

'రామకృష్ణగారూ — మాకు గోవిందరావు గారి అప్పులు చాలా వున్నాయి — అవన్నీ తీర్చాల్సిందే — అది జరిగేవరకూ ఆస్తి ప్రాచిక పుస్తక ఖర్చుపెట్టడానికి వీలులేదు— పీళ్ళు వెళ్ళండి ఇంటికి—'

రామకృష్ణ న్యాయపద్ధతిలో ఇల్లు పరీక్షించాడు.

ఇంట్లో ఒక్కవరు లేదు—

'విక్కున విలువైన వస్తువులేదు—

కాష్ చిల్లిగవ్వలేదు—

మోహనరావు శవదహనం ముందు సమస్యగా మారింది—

గోవిందరావు మరదలి దగ్గరికివచ్చి అడిగాడు 'అమ్మాయ్—నలుగురిలో ఇప్పుడు నవ్వులపాలౌతున్నాము—ఆ డబ్బు ఎక్కడ దాచావో చెప్పు. కనీసం దహనకాండకన్నా కొంత రొక్కం నాచేతికియ్యి—'

సౌందర్య నవ్వింది—

విచిత్రమైన నవ్వు

ఎవ్వరూ వ్యాఖ్యానం చెప్పలేని కన్నీటి నవ్వు — భర్తను అల్లరిపాలు చేయడానికై అప్పుల వాళ్ళతోసహా వచ్చిన బావ తన్ను నవ్వులపాలు కాకుండా రక్షించమని డబ్బు అర్థిస్తున్నప్పుడు నవ్విన నవ్వు—

సౌందర్య నవ్వు గోవిందరావుకు విడమి కాలిచెప్పు దెబ్బలా తగిలింది—

మోహనరావు ఆఫీసుస్టాఫ్ అంతావచ్చారు—

అందరూ సానుభూతి చూపారు—

తలా ఒకమాటా అనుకున్నారు—

మునిసిపాలిటీ బండిలో స్మశానం చేరవేసి దహనం అయిందనిపించారు.

పతివ్రత భర్త అనాథ ప్రేతంలాగా చందాలతో దహింపబడ్డాడు.

ముష్టెత్తిన పైసలతో వెలరేగిన అప్రతిష్ఠలాగా మంటలు భగభగలేచాయి—

కనకం ఇంట్లో దాగిన ఏడువారాల నగల బంగారంలాగా మంటలు మిల మిలా మెరిశాయి. ●

# శబ్దగుణాలు చిత్రాల్లో వేయింపబడుతున్న మాంసపుకూర

## ఇయన్ బ్రౌన్

ఎఫ్. డబ్ల్యూ. ఎఫ్. ప్రతినిధి ఇయన్ బ్రౌన్ ఈ వ్యాసంలో రేడియో, టెలివిజన్, సినిమాలలోని శబ్దకల్పన రహస్యాలను వెల్లడి చేసారు.

కొబ్బరి చిప్పలతో గుర్రాల గిట్టల సవ్వడిని అనుసరించడం ప్రారంభించి నప్పటినుండి శబ్దగుణాలు బాగా అభివృద్ధి చెందాయనే చెప్పాలి. ఈనాటి అత్యంత సున్నితములైన ప్రేషక గ్రాహక ఉపకరణములతో నిజమైన ధ్వనులను ఇంచుమించుగా తిరిగి ఉత్పత్తి చేయవచ్చును. అయినా కొన్ని మంచి ఫలితాలకొరకు ప్రాతకాలపు తంత్రములను ఉపయోగింపవలసి వస్తున్నది.

బాణలిలో మాంసపుకూర వేయించే శబ్దం మైక్రోఫోనుద్వారా రణగొణధ్వనిలా వినబడుతుంది. అదేవిధంగా అగ్గిపెట్టెతో కరకర శబ్దములుచేస్తే ఒక యిల్లు తగలబడుతున్నప్పుడయ్యే శబ్దములాగుంటుంది. స్టూడియోలో మైక్రోఫోనులను సరిగ్గా అమర్చగలిగితే ధ్వనిని దృశ్యముతో కలిపి పోయేనట్లు చేయడం ఏమంత కష్టం కాదు. కాని ఇవన్నీ ఒక్కచోట ఉండాలంటే పెద్ద చిక్కవుతుంది. కాబట్టి శబ్దాన్ని తర్వాత స్టూడియోలో రికార్డు చేసి, ఆ వెనుక 'డబ్' చేస్తారు.

యుద్ధ సన్నివేశములప్పుడయ్యే ధ్వనిని పుట్టించడం కొంచెం కష్టమే. ఎందుకంటే నటుల గుదులాటప్పుడయ్యే ధ్వని ఎక్కువగా ఉండదు. తెరమీది దృశ్యముతో ధ్వనిని 'మేళవింప' జేయడం చాల కష్టం. నిజమైన యుద్ధాన్ని రికార్డు చేస్తే సంతృప్తికరంగా ఉండదు. అంచేత టెలివిజన్, సినిమా దర్శకులు తలగడలను దబ్బుమనిపించుతూ, దీర్ఘశ్వాసములు వదులుతూ వాటి ధ్వనిని దృశ్యములో లీనమయ్యేటట్లు చేస్తారు. అలాగే స్నానపు సామాగ్రిని ప్రయోగించడంవలన, గాజు పలకలను పగలగొట్టడం వలన వచ్చే శబ్దాన్ని స్టూడియోలో సాహాయ్యకులు 'కారు ఢీకొనే' దృశ్యానికి కూర్చుతారు.



ఒక కొయ్యముక్క మరొక కొయ్యముక్కలో దూర్చి శబ్దమును రప్పించే పాత పద్ధతిని బట్టి తలుపుల 'కిర్రు కిర్రు' ధ్వనులను బాగా పుట్టించవచ్చును.

శబ్ద కల్పనలో నైపుణ్యాన్ని భీకరమైన చలనచిత్రాలలో తెలుసుకోవచ్చును. ఉదాహరణకు ఒక మనిషి పుర్రెను చితుకకొట్టుతున్నప్పుడయ్యే శబ్దాన్ని బంగాళదుంపలో కత్తిని దూర్చుతూ, కాబేజీని తరుగుతూ వుండడం వలన అయ్యే ధ్వని ఒక్కటే. తోటకూర కాడను ముక్కలుగా చేసేటప్పుడయ్యే శబ్దం ఎముకలు విరిగేటప్పుడు కలిగే ధ్వనికి అనుగుణంగా ఉంటుంది.

బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ వారి 'శబ్ద కల్పనాశాఖ' తాము 80 వేల శబ్దములకు పైగా టేప్‌మీద రికార్డు చేసినట్లు గొప్పలు చెప్పుకొన్నా ఆ సంస్థ ఇంకా ఎముకలు విరిగే శబ్దాన్ని పుట్టించడం సరిగా చేయలేదు. గత సంవత్సరం ఒక నగ్నసుందరి తన అంగమర్దన చేస్తున్నప్పుడు కలిగే శబ్దాన్ని కొంచెమైనా హెచ్చుతగ్గులు లేకుండా ధ్వనింపజేసారు. వెనుకటి కాలంలో స్టూడియో యజమాని



తన పంట్లాము మడిచి తన తొడను కొడుతూ శబ్దాన్ని రప్పించి ఉండేవాడు.

**నవ్వుల అనుకరణ**

వాతో ఒక బి. బి. సి, శబ్దనిపుణుడు ఇలా అన్నారు. 'ఇప్పుడు మనకి కావలసిన ధ్వనులు పుట్టించగలిగినప్పటికీ వీటిలో హెచ్చుతగ్గులు లేకుండా చూచుకోవడంలో చాలా జాగ్రత్త తీసుకోవాలి. మన పరికరాలు అభివృద్ధి అయినట్లే 'రిసీవర్లూ' అభివృద్ధి అయ్యాయి. అంతేకాక శ్రోతలు చాలా విమర్శనా దృష్టి కలవారు. ఉదాహరణకు ఒక రేడియో నాటకంలో ఒక పాత్ర 'అక్కడ న్యూయార్క్ విసి 10 వెళ్తోంది' అన్నాడనుకోండి. మేము వేరే విమానంయొక్క ధ్వనిని ప్రసారిస్తే ఆ తర్వాత వచ్చే శ్రోతల ఫిర్యాదులను చూసి మీరే ఆశ్చర్యపోతారు.

టెలివిజన్ చూపేటప్పుడు నవ్వుని అనుకరించడం చాలా అవసరం. ఒక మనస్తత్వ వేత్త చెప్పినట్లు చాలామంది ఒక వినోదాన్ని చూసి మిగతావాళ్లు నవ్వినపుడే దాన్ని వినోదంగా భావిస్తారు. మనమూ నవ్వడానికి పురికొల్పబడుతాము. వారివలన మనలోని విమర్శనాశక్తి పోయి ఓర్పు అభివృద్ధి అవుతుంది.

'మెకెన్ జీ స్వీటెనర్' అనబడే రెండడుగుల పొడవైన పేటిక ద్వారా నవ్వు అనుకరింపబడుతోంది. దానిలో వివిధములైన నవ్వులు టేప్ రికార్డు చేయబడి అమర్చబడుతాయి. సరియైన చోటునే చిత్రం రికార్డు చేస్తున్నప్పుడు దర్శకులు ఉపయోగిస్తారు. ●




దొడ్లో స్నానంచేసి పాతచీర ఒంటికి చుట్ట బెట్టుకుని, చుట్టూ ఎవరూ తొంగిచూస్తుంటారేమోనని... (fn) ముగపురుగుల్లేరని అటూ ఇటూ చూసి ధృడ తిర్చుకున్నాక లేడిపిల్లలా ఒక్కదూకు దూకింది ఈరమ్మ, ఇంట్లోకి. వసారాలో మడత మంచమ్మీద కూర్చుని సిగిరెట్టు కాల్చుకుంటూన్న సత్యం వులిక్కిపడి నిటవు గుడ్లేసుకుని ఈరమ్మనే చూస్తుండి పోయాడు, కాసేపు.

అస్తవ్యస్తంగా చుట్టబెట్టుకున్నబట్ట ఒంటినంతా కప్పలేక పోతూంది ఈరమ్మని.

తడిసిన ముంగురులు చంపల్ని అంటుకు పోయాయి.

నీటిబొట్లు ముత్యాల్లా బుజాలమీదా, బబ్బలమీదా విర్సివున్నాయి.

అనాచ్ఛాదితమయిన వీపు నిగనిగ మెరుస్తూ కైపు ఎక్కించేట్లుంది.

ఒక్కక్షణం అదిరిపడి ఆ వెంటనే ఇంట్లోకి దూరింది ఈరమ్మ.

ఈరమ్మ బట్టలు కట్టుకు వచ్చేసరికి సత్యం ఇంకా గుప్పుగుప్పున పొగవదుల్తూ చార్మినారు పీలుస్తూనే వున్నాడు; ప్రాణాలు కళ్లలోనే వున్నట్టుంది మనిషికి. ఎముకలు బయటికొస్తున్నాయి.

'ఎప్పుడొచ్చా ?' అడిగింది ఈరమ్మ, గుమ్మంలోనే నిలబడి, మర్యాదకని.

'ఇప్పుడే ?' సత్యం పొడిదగ్గు దగ్గాడు.

'ఎక్కణ్నుంచీ రావటం ?'

'బస్తీనుంచే'— దగ్గు పొర ఆగలేదు సత్యానికి.

'అంతా బాగా వున్నారా ?'

'ఆఁ' దగ్గులో కలిసిపోయింది సమాధానం.

'ఏంచేస్తున్నా విప్పుడు ?'

'ఆర్నెల్లయింది, ఫ్యాక్టరీలో వుద్యోగం

రెండొందలు వస్తాయి. సంవత్సరానికల్లా పై వుద్యోగం ఇస్తామన్నారు. అప్పుడు మూడొందలవుద్ది జీతం.'

'అహా. మీయమ్మ నీదగ్గరే వుంటూందా ?'

'లే. ఎంత చెప్పినా మనూరొదిలి రానని పంతం పట్టింది. ఏంచెయ్యను ? ఒక్కడ్నే వుంటున్నా.' దగ్గు నాపుకున్నాడు సత్యం.

'సర్లే. ఎండని బడొచ్చిన నట్టున్నావు. స్నానం చేస్తావా ?'

'ఆఁ' సిగరెట్టు పారేసి, దగ్గుతూ లేచాడు సత్యం.

స్నానానికి నీళ్ళు తోడి, సబ్బు తువ్వాలూ అందించింది ఈరమ్మ.

స్నానంచేసి అన్నంతిని గుర్రు పెట్టి నిద్ర పోయాడు సత్యం. సత్యం బాగా చిక్కిపోయాడు. పక్కింటికి షికారుపోయి తిరిగొచ్చిన ఎంకమ్మ 'ఎవరే వచ్చింది?' అనడిగింది ఈరమ్మని.

'మావూరే, చుట్టాలు. బస్తీలో వుద్యోగం చేస్తున్నాడు.'

'కుర్రాడు ఎర్రగా బుర్రగా బాగానే వున్నాడు. పెళ్లయిందా ?'

'లేదు.'

'ఏం ? ఎందుకని ? పెళ్ళి సెయ్యాల్సిన అప్పచెల్లెళ్ళున్నారా ?'

'లేరు.'

'మరెందుకట ?

'బుద్ది మంచిదిగాక' అంటామని నోరు తెరిచింది ఈరమ్మ. కాని ఆ మాటలు పెదాల్లోనే మింగుడుపడి పోయేయి.

'ఉంటాడా ఒకటి రెండ్రోజులు ?'— ఎప్పుడెళతాడని అర్థం.

'లే. వెళ్ళాలంటున్నాడు. అర్జంటుపని వుందట. దారేగదా అని చూసి పోదామని దిగాడట.' సరిగ్గా తెలీక పోయినా కట్టుకు పోయి అబద్దం చెప్పింది ఈరమ్మ.

ఎంకమ్మ అన్నంతిని మళ్లీ వూరిమీదకి వెళ్ళింది. ఎంకమ్మకి పని లేదు, పాటే. కోడలిమీద పెత్తనం చలాయించటం, వూరిమీద పడి తిరగటం, అన్నీ అమర్చి పెడితే తిని నిద్రపోవటం. ఎంకమ్మనోరు పెద్దది. ఆ నోరుకి జడిసే కొడుకూ కోడలూ ఆమెఅడుగులకి మడుగులొత్తుతారు. ఎంకమ్మ కొడుకు స్వతహాగా మెతకుడు. అతడి చిన్నప్పుడే తండ్రి పోగా, కొడుకుని కంటికి రెప్పలా కట్టుదిట్టంగా పెంచింది ఎంకమ్మ. జాగ్రత్తగా సంసారం నడుపుకుంటూ వున్న కొండని మరింత పెంచింది. ఈడురాగానే కొడుక్కి పెళ్లి చేసి ఈరమ్మని కాపురానికి తీసుకొచ్చింది. ఇప్పటికీ ఎంకమ్మంటే కొడుక్కి భక్తి, ఈరమ్మకి అత్తంటే భయం. ఇంటో అంతా ఎంకమ్మదే రాజ్యం.

సత్యం మధ్యాహ్నం మూడువ్వరకి నిద్ర లేచి ఒళ్ళు విరుచుకున్నాడు, దగ్గుతూ.

'మంచినీళ్లు కావాలా ?'

'ఆఁ'

ఈరమ్మ మంచినీళ్లందించింది. మంచినీళ్ళతాగి గ్లాసు తిరిగి ఇస్తూ ఈరమ్మనే పరీక్షగా చూసాడు సత్యం. ఆ చూపు గుండెల్ని తోడేసేటట్టుంది.

ఈరమ్మ చిన్నప్పుడు గిడసబారిపక్కరలా వుండేది. పొట్టి జడవేసుకుని ఎగురుతూ తిరిగేది. అట్టాంటి ఈరమ్మ పెళ్లయి రెండేళ్లు తిరక్కుండానే నవనవలాడుతూ పొట్లకాయలా తయారయింది. ఎగసిపడే సెలయేరులా యవ్వనం ఎగిరెగిరి పడుతోంది. బుగ్గలు పుష్టి నిగారిస్తున్నాయి. మెడా నడుమూ నున్నగ మెరుస్తున్నాయి.

'ఏంటి చూస్తున్నావ్ ?'

'ఏంలేదు. మీ ఆయనేడి ?'

'పొలం వెళ్ళాడు. ఏం ?'

'చూద్దామని. నీపెళ్లి నాకు చెప్ప కుండానే చేసుకున్నావుగా ?'

ఈరమ్మ సిగ్గుపడింది.

'మంచాడేనా ? నిన్ను బాగా చూసు కుంటాడా ?'

'..............'

'అందగాడేనా ? నీ మనసుకు నచ్చాడా?.

'..............'

'నేనే ఏదో పిచ్చిపిచ్చిగా అడుగుతున్నా గాని నచ్చకపోతే కాపురం ఎట్టాచేస్తా వేంటి ?'

'..............'

'ఎంతసేపూ నే మాట్లాట్టమేగాని నువ్వు మాట్లాడవా ఏంటి ?. నువ్వొగానే మర్చిపోయావుగాని నేనుమాత్రం జన్మలో మర్చిపోలేను నిన్ను. అందుకే నువ్వు నన్ను దూరంచేసినా నేనుమాత్రం నిన్ను వారిపెట్టలేకుండా వున్నాను. నీ కోసమని కష్టపడి 'ఒకటి' తెచ్చాను. చెప్పుకో ఏంటో ?'

ఈరమ్మ ఆశ్చర్యపడింది!

ఈరమ్మ కుడికన్ను అదిరింది!!

ఈరమ్మ నరాలు జివ్వుమన్నాయి. కాళ్ళు వణికేయ్!!

అంతలోనే సత్యం తన సంచిలోంచి ఒక ప్యాకెట్టు తీసాడు. అందులోంచి వంగపండు రంగుచీర లాగాడు. చింతపూల జాకెట్టుగుడ్డ బయటికి తీసాడు.

'ఇదిగో తీసుకో. నీకోసమనే తెచ్చాను. ఆ రోజుల్లో ఇవంటే నువ్వు మోజుపడే దానివి — జ్ఞాపకముందా ? అప్పుడు మనకి తెలిసీ తెలియని మనస్సులు. రెపరెపలాడే తున్న వయస్సులు. పెద్దాళ్ళకి తెలీకుండా చింతల తోటలోచేరి ఆడుకునే వాళ్ళం. ఏన్నో ఆటలు. ఒకళ్ళంటే ఒకళ్ళం పడి చచ్చేవాళ్ళం. ఇద్దరం భార్యాభర్తలయి నట్టుగానే వూహించుకుని సరసించే వాళ్ళం. అప్పుడప్పుడే నువ్వు ఓణీలు వేసు కుంటున్నావు. అలోగా ఓరోజు వచ్చి ట్టుండి నువ్వు పెద్దమనిషి వయ్యావని నిన్ను మీవాళ్ళు బయటికి రానిచ్చారుగాదు. పిచ్చిపట్టినట్టు నీ గురించి తిరిగాను. మీ నాన్నచేత దెబ్బలు తిన్నాను. పిచ్చాడినయి దేశాలవెంట పోయాను. తాగుబోతు నయాను. రౌడీనని పేరు వచ్చింది. ఇదంతా ఎందుకు జరిగింది. నీకోసము — నీకోసం నంటే నమ్ముతావా?' సత్యం ఆగాడు. దగ్గుతెర వచ్చింది.

'ఇప్పుడవన్నీ ఎందుకు సత్యం ? వుప యోగమేంటి ?' అంది ఈరమ్మ. సత్యం కోరగా చూశాడు ... 'ఉపయోగాలు లేవం టావా ? ఏం ? ఎందుకు ?'

ఈరమ్మ తలవంచుకుని వుండిపోయింది.

'సర్లే. ఇవి తీసుకో. నా సంతోషం కోసం ఇస్తున్నా తీసుకో.'

'ఉహూఁ వద్దు.'

'వద్దా. అమ్మ ఈరాలూ! ఎంత ఎదిగిపోయావ్! దొంగా! నువ్వు వద్దంటే మాత్రం నే వూరుకుంటాననేంటి?' పట్టు దలగా అన్నాడు సత్యం.

'......'

'ఏదయినా సరే. నువ్వు పుచ్చుకోవా ల్సిందే. నేను ఒప్పుకోవాల్సిందే. అవును గాని మీయాయనకి ఓ కాలు కుంటి దంటగా, ఆ కుంటాడితో ఎట్టా కాపురం

# అన్వేషి

చేస్తున్నావ్? నమ్మా వాణ్ని పోల్చుకొను కోవా ఎప్పుడయినా? అప్పుడయినా ఆప్పిం చదూ ?'

'ఇప్పుడయ్యేన్నీ ఎందుకు సత్యం? ఆ చీర సంచిలోపల పెట్టుకో. చుట్టమై చూడవచ్చావు ? మర్యాదగానే వెళ్ళిపోతే అందరికీ మంచిదిగాదా ?'

సత్యం పకపక నవ్వాడు. 'మర్యాదా ? కొత్తగా మాట్లాడుతున్నావ్ ఈరలూ ? అసలు నీ గురించేగదా నేను ఇట్లా అయిపోయింది. నీకు ఆ మాత్రమయినా జాలి లేకపోయింది నామీద?' — నిష్ఠురంగా అన్నాడు.

'ఏమే కోడలపిల్లా ? చుట్టానికి మర్యాదలు బాగా చూసుకుంటున్నావా?' వెంకమ్మ వచ్చింది.

'కాసునాండ్ల పిల్లాడితో కొడుకు కబురంపించాడు. 'కుప్ప నార్పిడి' అవలేదట. రాత్రికి అన్నం అక్కడికే పంపించమన్నాడు. పెందలాడే వంటకానీ. నేవెట్టుకెళ్తా.'

ఈరమ్మ లోపలికి వెళ్ళింది.

వెంకమ్మ సత్యంతో కబుర్లు వేసుకుంది. సత్యం ఉంగరాలజుట్టునీ, సిలుకు చొక్కానీ పరీక్షగాచూస్తూ అతన్నిగురించి అడిగింది. సత్యం బస్తీలో వుద్యోగం చేస్తున్నాడనీ, నెలకి రెండొందలదాకా సంపాదిస్తున్నాడనీ తెల్సుకుని అతనిమీద గౌరవం పెంచుకుంది. కాసేపు మునలాకోట్ల బాతాఖానీ వేసి దాన్నబ్బేసి పూర్కో కెళ్ళొస్తానని చెప్పి సత్యం బయట కెళ్ళాడు.

ఆపూటంతా ఈరమ్మ మనసు మనసులో లేదు.

పెళ్ళికాకపూర్వం తెలిసీతెలియని వయసులో తను సత్యంతో తిరిగినమాట నిజమే. సత్యం ఎర్రగా బుర్రగా వుండే సంగతి కరక్టే. సత్యం మాటలపోగు. అదీ ఇదీ చెప్పి ఆడుకుందామనిచెప్పి తనని వెంట తిప్పేవాడు. తనేగాదు తన స్నేహితురాళ్ళు రాఘవమ్మా, రంగమ్మా కూడా అతని మాయలో పడ్డారు. రాఘవమ్మ అందరికన్నా పెద్దది. రంగమ్మ అంతేగాని కొంచెం గడుసుది. 'తను' మొదట్నించీ అమాయకపు మొద్దు. ఆరోజుల్లో సత్యం వాళ్ళకి బాగా ఆస్తిపాస్తులుండేవి. సత్యం ఒక్కడే కొడుకవటంవలన అల్లారుముద్దుగా పెరిగాడు. జేబులో చిల్లర డబ్బులు ఎప్పుడూ గలగల లాడుతుండేవి. వాటితో జీళ్ళు, చక్రాలు కొని తెచ్చేవాడు. వాటికోసం ఆశపడి అతనివెంట తిరిగేది తనూ.

సత్యం తండ్రి టింగురంగా అంటూ వుండేవాడు. పొద్దేపి బస్తీకెళ్ళి క్లబ్బులో పేకాట ఆడేవాడట. బస్తీలో పేకాట్లకి, మిగతా అలవాట్లకి ఆ రోజుల్లోనే ఆస్తిని హారతి కర్పూరం చేశాడనేవారు, సత్యం తండ్రిని.

అప్పుడు సత్యంతో ఎన్నో ఆటలు ఆడుకునేవాళ్ళు తనూ, రాఘవమ్మా, రంగమ్మా. అప్పటికే రాఘవమ్మ ఈడేరివుంది. అందుకే పెద్దాళ్ళకి తెలీకుండా చాటుమాటున వచ్చి జట్టు కలిసేది రాఘవమ్మ. ఒక్కోసారి చీకటిపడేసరికి భయమేసి తనూ, రంగమ్మా ఇంటికి వెళ్ళిపోయేవాళ్ళు. రాఘవమ్మ ఒక్కతే సత్యం బలవంతంవలన— తను వుండిపోయేది. అప్పుడు తనింకా చిన్నపిల్ల. సరిగా వూహ తెలియదు. ఆటల సందిలో చిరుతిళ్ళ మోజులో వుండేది.

ఆ రోజుల్లోనే అది జరిగింది.

రాఘవమ్మ శవం ఒకరోజు ఉదయాని కల్లా 'వెంకయ్యగారి బావి'లో తేలివుంది!

నలుగురూ గుసగుసలుగా అనుకున్నారు. తనకి తెలియదు ఏం జరిగిందీ. ఆ మర్నాటినుంచి బయటి కడుగుపెడ్తే కాళ్ళు విరగగొట్టా నన్నాడు అన్నయ్య. అప్పుడప్పుడే తనకి ఓణీలు వేయించారు. కాపలాగా ఇంట్లో ఎవరో ఒకరు తనని గమనించేవాళ్ళు. కాళ్ళు కట్టేసినట్టుయింది తనపని.

సత్యం కాలుగాలిన పిల్లిలా తన ఇంటిచుట్టూ తిరిగేవాడు. ఓరోజు సమయం చూసి ఎవరూ చూడకుండా చింతలతోట కెళ్ళింది, సత్యం వెంట. సత్యం ఎన్నో చెప్పాడు. ఆ కబుర్లు ఎంతో తియ్యగా వున్నాయి. చేతిలో చెయ్యివేసి ఎన్నో బాసలు చేశాడు. ఆ ప్రపంచం ఎంతగా కొత్తగా అనిపించింది.

ఉన్నట్టుండి పిడుగు పడినట్లయింది! తియ్యనయిన ఆ ప్రపంచంనుంచి లేచి ఉలిక్కిపడి చూస్తే...

ఎదురుగా నాన్న!

సత్యం చెంపలు పేలిపోయాయి. 'రాఘవమ్మ ప్రాణాలు నిలువునా తీసి ఉసురోసుకున్నావు. ఇంకా ఎంతమంది ఆడపిల్లల్ని చెడగొడ్తావురా రాస్కెల్?' అని అరుస్తూ సత్యాన్ని ఒళ్ళు కందిపోయేలా కొట్టాడు నాన్న. చెంప చేత్తో పట్టుకుని పారిపోయాడు సత్యం. ఆ రోజు తన వీపూ పగిలింది. ఒళ్ళు పేలిపోయింది. గదిలో పెట్టి తాళం వేసారు. అన్నం లేదు, ఆ పూట.



మరీ అంత సడన్‌గా బ్రేక్ వేస్తే ఎలా?!

అలకలలో,
వేడికోళ్లలో,
లాలింపులలో,
కవ్వింపులలో
మనోహరంగా
ద్యోతకమయ్యే
మగువల
మనోవికారాలే
'మెఫ్రిన్'కు
ప్రేరేపకాలు!






మెఫ్రిన్

'మెఫ్రిన్' చీరలు మానినులను స్వప్న సుందరిలా అలంకరిస్తాయి.
కారణం, అవి చిరుగాలి తరగలవలె తేలికగా ఉంటాయి.

'మెఫ్రిన్'—100% పాలియెస్టరు చీరలు మరియు పాలియెస్టరు కలిపిన
కాటన్ చీరలు; పాలియెస్టరు కలిపిన డ్రెస్ మెటీరియల్సు—తేలికయైన లాన్సు,
వేసవి కాంబ్రిక్సు మరియు సొగసైన మనోహరమైన పాప్లిన్సు
ఇంకా, అధునాతనమైన అద్భుతమైన రంగులలో మరియు ప్రింట్లలో
పాలియెస్టరు కలిపిన 'టెరొసెల్' కాటన్ షర్టింగులు; హుందాయైన రంగులలో,
చారలలో, గళ్లలో పాలియెస్టరు కలిపిన 'ఎస్టర్‌కాట్' కాటన్ సూటింగులు.

**మఫత్‌లాల్ గ్రూప్**

AIYARS-M. 287 TL

'ఇంకా నయం. పెద్దమనిషయి వుంటే కొంపకేసి వుండును' అని అమ్మ గొణుక్కోటం తనకి వినపడింది.

అంతే! మళ్ళీ తను అడుగు బయటికి పెట్టలేదు, ఇంట్లోంచి.

అప్పట్నుంచీ సత్యం కనపడలేదు. అతన్నెవడికో బస్తీలో ఎవరో పొడిచి చంపేసారట. బంధువు లెవరో తన్ని పారదీసారట. సత్యం ఏమయిందీ తెలీలేదు. మిగిలిన ఉన్న పొన్నులు అప్పులవాళ్ళు కట్టుకున్నారు. ఒకసారి అన్నయ్యకి బస్తీలో కనపడి పలకరించాడట సత్యం. మనిషి చిక్కి శల్యమైనాడట. ప్రాణం కళ్ళలో వుందట. అతన్ని చూసి అన్నయ్య జాలి పడ్డాడట. సత్యం అన్నయ్యని అడిగి పేరు పేరునా వూళ్ళో అందరి గురించీ తెలుసుకున్నాడట. 'తను' పెళ్ళయి అత్తారింటికి వెళ్ళిపోయిందని తెల్సుకుని సంతోషం ప్రకటించాడట. అందరూ సుఖంగా వున్నారు, అంతే చాలు అన్నాడట.

'సత్యం ఏదో జబ్బుతో బాధ పడుతున్నాడు. ఎక్కువకాలం బతకడు' అన్నాడు అన్నయ్య. బస్తీలో అన్నయ్య స్నేహితుడు ఒకాయన కనిపించి అన్నయ్య 'సత్యాన్ని' గురించి అడిగితే చెప్పాడట.

సత్యానికి లేని వ్యసనాలు లేవట. తాగుడు, దొంగతనం, పేకాట, స్త్రీ వ్యసనం.

'వాడు శాపగ్రస్తుడు. అతని బతుకే కుళ్ళు గుంట. అతని నీడ పడితే చాలు నవ నవలాడుతున్న చెట్టు మాడిపోతుంది.' అన్నాడట ఆ స్నేహితుడు.

అంతే!

తర్వాత సత్యం గురించి ఏం తెలీలేదు, తనకి.

బతుకుబాటలో పడి అదొక పీడకలలా అంతా మర్చిపోయింది.

నిశ్చలంగా ఒకదార్ని వడుస్తున్న తన జీవితంలోకి వున్నట్టుండి సుడిగాలి వలె దూసుకు వచ్చాడు సత్యం. ఇంటి కొచ్చిన మనిషిని మొహాన్న తలుపు మూసి వెళ్ళిపొమ్మని చెప్పలేకపోయింది తను. చుట్టమని అత్తతో అబద్ధమాడింది కూడా.

ఇప్పుడు సత్యం ఎందుకు వచ్చినట్టు? వెతుక్కుంటూ వచ్చిన సత్యం తన పచ్చని బతుకుకి నిప్పు పెడతాడా? తగుదునమ్మా అంటూ పాత విషయాల్ని తిరగెయ్యటంలో అతని వుద్దేశ్యమేమిటి? చీర తెచ్చాను పుచ్చుకోమనటంలో అంతరార్థం? ఎట్లా ఈ పీడ వదల్చుకోవటం?! అత్తకి తెలిస్తే తన బతుకేంగాను? సత్యం ఏం మనిషి?

అతను మనిషా రాక్షసుడా?

ఈరమ్మ కాలుగాలిన పిల్లిలా తిరుగుతానే వుంది. గుండెలు గుబ గుబమంటున్నాయి.

ఎలాగోలా వంట పూర్తయిందనిపించింది.

ప్రొద్దు పడమటికి వాలిపోయింది.

చీకటి కమ్ముకుంది.

కొడుక్కి అన్నం తినిపించి నిద్రపుచ్చింది... కోడుక్కి అన్నం తినుమని చెంబు... 

ఒంటరిగా బిక్కు బిక్కుమంటూ కాలు కాలిన పిల్లిలా అయింది ఈరమ్మ.

చీమ చిటుక్కుమంటే వులిక్కిపడింది.

'ఏం చేస్తున్నావ్?' దగ్గరగా కూడిన ప్రశ్న. ఆ గొంతు ఎవరిచ్చిందీ కాదు. ఈరమ్మ గుండె గుభిల్లుమంది! తన బతుకు బండలవుతుందా?

సత్యం! చీకట్లో తెల్ల తెల్లగా దయ్యంలా వున్నాడు.

ఈరమ్మ కళ్ళు నిండి చెంపల్ని తడిపేసాయ్.

సత్యం కాళ్ళ మీద పడి 'సత్యం! నన్ను క్షమించి ఒదిలిపెట్టి నీ దార్ని నువ్వు వెళ్ళిపో. నన్నిట్లా బతకనీ' అని ఏడవాలనిపించింది.

సత్యం నోట్లో సిగరెట్టు ఎర్రగా వెలుగుతూంది. అది ఆరని మంటవలె వచ్చి తనని దహించుకుపోతున్నట్టు విలవిల లాడింది ఈరమ్మ.

సత్యం అరుగు మీద కూర్చున్నాడు, దగ్గు ఆపుకుంటూ.

'కూర్చో ఈరాలూ! నీతో చాలా మాట్లాడాలి. మళ్ళీ అవకాశం దొరకదు.' అన్నాడు సత్యం. అవకాశమట! తన బతుకంతా అట్లా అనే కాల్చుకున్నాడు, మొండిగా. నిర్వంగా అరుగు కింద నేల మీద చతికిలపడింది ఈరమ్మ.

'పిచ్చిదానా! నేనంటే భయపడుతున్నావా? ఎందుకు భయం? నేనేగా? నీ స్నేహితుడు సత్యాన్నేగా. ఎవరమయినా బతికినంత కాలం బతకం. ఎప్పుడో గుటుక్కుమంటాము. చేసుకున్న పాపాలు వెంటబడి కరిచి గాని ఒదిలిపెట్టవు. ఇప్పుడు నా పరిస్థితి నాకే జాలి కలిగిస్తుంది. మరెవరికీ నా మీద జాలి లేదు. అభిమానం లేదు. నా బతుకు నాకే అర్థం గాదు. ఈ పరిస్థితిలో మిగిలున్నావని కొండంత ధైర్యం ఇస్తావని వెతుక్కుంటూ నీకోసం వచ్చాను. నా తండ్రి అల్లా అయిపో



యాడు. తల్లీ వున్నా లేనట్టేనాకు నేనే మిగిలాను. మొదట్నుంచీ నా బ్రతుకు ముళ్ళ త్రోవల వెంట నడిచింది. చెప్పే వాళ్లు లేరు. స్వతస్సిద్ధంగా కొంత. అంతా స్వయంకృతం. తెలిసినవాళ్లు నన్ను అస హ్యించుకున్నారు. తెలీనివాళ్ళకి నా గురించి పట్టదు. నా బ్రతుకంతా ఆడదాన్ని గురించి అన్వేషణతోనే గడిచిపోయింది. నా జీవితం శాపగ్రస్తమయింది. అది నా దురదృష్టం. అంతే. తెలిసీ తెలియకా తప్పులు చేశాను. రాఘవమ్మకి అన్యాయం జరిగింది. అందుకు నేనే కారణం. ఏమిటో అల్లా అయిపోయింది. జీవితంలో ఆటగా ఆడాను. ఆఖరికి నా పని పగిలిపోయిన బంతి వతు అయింది. అంతా అయిపోయింది. ఇప్పుడే మనుకునీ ఏంలాభం? ఎందుకో నిన్ను చూడాలనిపించింది. రంగమ్మని చూడాలని వెళ్తే నా మొహాన్నే తలుపేసి అవతలకి పొమ్మంది. ఇప్పుడు నా బ్రతుకులో నువ్వే ఆశారేఖవి. మన స్నేహాన్ని గురించయినా నామీద దయచూపించలేవా ఈరాలూ!' దగ్గరవచ్చి సత్యం ఆగేడు.

ఈరమ్మ రాతిబొమ్మలా వుండిపోయింది.

'నేను మంచివాడిని కాను. నిజమే. నా దుష్టభావంతో ఏ క్షణంలో ఏం చేస్తానో నాకే తెలీదు. అదీ వాస్తవమే. పొద్దుట రాగానే అర్ధనగ్నంగా కన్పించిన నీ సౌందర్యం నాలో భ్రమ కలిగించింది. ఆ చాంచల్యంలో ఏదేదో మాట్లాడాను. రక్తమాంసాలతో కూడిన ఈ శరీరం రాలిపోయేదాకా మనిషిలో కోరికల్ని రేపి పిచ్చి ఎక్కిస్తోంది. అయితే...'

సత్యం ఆగేడు. కళ్ళు ఖళ్ళుమని అరుస్తూ మెడనరా లుబ్బేయి.

'ఈరాలూ! మాట్లాడవేం?'

'ఏం మాట్లాడను?' ఈరమ్మ గొంతు వణికింది.

మాట్లాడటం ఇష్టంలేనిదానివి నన్ను చుట్టి మన్నెప్పి మర్యాదలు ఏందుకు చేశావు? రంగమ్మలాగా అరిచి నన్ను వెంటనే ఏందుకు బయటికి నడిపించివేశావు పోయావ్?'

'..................'

'నాకు తెలుసు, ఇంకా నీలో నామీద అభిమానం వుంది. అదే నా అదృష్టంగా పొంగిపోతున్నాను. ఈరలూ! నిన్ను చూసాక నా మనసు ఏలా వుందో తెల్సా? మండు టెండలో నడిచి దప్పిక గొన్న ప్రాణికి చల్లని మంచినీరు దొరికినట్టు అయింది. నాకు ఇప్పుడు కావల్సింది ఇంత ఓదార్పు, దయ. అంతే.'

'...............'

'ఇక సమయంలేదు. ఈరాలూ! నా సంచి ఇలా ఇవ్వు. చిన్న పనుంది.'

ఈరమ్మ లేచి సంచి తెచ్చి సత్యంకి ఇచ్చింది, వణికే చేతులతో.

'వంటయింది. అన్నం తింటావా?' అంది, సంచి ఇస్తూ.

సత్యం కళ్లల్లో మెరుపు మెరిసింది! కాని ఆ మెరుపు నల్లటి చీకటిలో కలిసిపోయింది.

# అన్వేషి

'వద్దు ఈరాలూ! ఇప్పుడు నేను అన్నం తినే స్థితిలో లేను.'

'అవును. ఇప్పుడు నువ్వు వున్నది నా బ్రతుకుని కోరుకున్న స్థితిలో అంతేగా.' ఈరమ్మ వెక్కిళ్ళుపోయింది. భయంతో పసిపిల్లలా గజగజలాడింది.

సత్యం నవ్వాడు, జాలిగా కంగు కంగు మని దగ్గాడు.

"ఎంత మాట అన్నావు ఈరాలూ! నేను దుర్మార్గుడినేగాని అంత పాపాత్ముణ్ణి కాను. చిన్నప్పుడు ఆడదంటే ఆటవస్తువుగా అనుకుని అమాయకురాలైన ఆడపిల్లల్ని మాయ చేసి వాళ్ళ బ్రతుకుల్తో నేను ఆడుకున్నమాట నిజమే. ఆ తర్వాత తెగిన గాలిపటాన్నయి ఆడదాన్ని నీచ వస్తువుగా భావించి ప్రవర్తించిందీ నిజమే. అంతేగాక ఆడదాన్లో ఇంకా అంతకంటె మహత్తరమయిన మాతృత్వం, జాలి క్షమ అనే గొప్పగుణాలున్నాయని నేను తెల్సుకున్నాను. అయితే అప్పటికి సమయం మించిపోయింది. నేనేం చెప్పినా అబద్ధంగా చలామణీ అయ్యే స్థితి నాకు నేను తెచ్చుకున్నాను. అయితే ఆ స్థితిలో కూడా నన్ను క్షమించి ఆదరించగల గొప్పతనం నీలో చూశాను. అటువంటి నిన్ను నేను కోరుకున్నట్టే నీ బ్రతుకుని నాశనం చెయ్యనా? వద్దు ఇక నే వెళ్తా ఈరాలూ. నన్ను క్షమించు. ఈ చీరా, గుడ్డముక్క తీసుకో. ఒక పాపాత్ముడు పవిత్రభావంతో ఇస్తున్న కానుకగా స్వీకరించి నేను ప్రశాంతంగా చావాలని మాత్రం ఆశీర్వదించు. అంతే వస్తా ఈరాలూ. నా బ్రతుకులో ఒక్క మంచిపని చేశానన్న తృప్తి నాకుండనీ.'

సత్యం గభాల్న లేచి ఈరమ్మ చేతిలో చీరా, జాకెట్టు ముక్కా పెట్టి విసవిసా నడిచి చీకట్లో కలిసిపోయాడు. దగ్గుతెర దూరంలో మాటుమణిగిపోయింది.

ఈరమ్మ అలాగే కూర్చుని మౌనంగా ఏడుస్తుండిపోయింది, నల్లటి చీకట్లో.

పాత జ్ఞాపకాలు నెమరుకువచ్చి మొహం తడిపేసాయి.

అందమయిన మొహంతో, షోకయిన బట్టలతో ఆడపిల్లల్ని ఆకర్షించి దొంగతనంగా ఆటలాడే సత్యం, నలుగురి చేతా ఛీ అనిపించుకొని దిక్కులేనట్టు దేశాలు పట్టిపోయిన సత్యం, తియ్యని అబద్ధాలు చెప్పి చిరుతిళ్లు అందించిన సత్యం, నాన్న చేత దెబ్బలు తిన్న సత్యం. పూర్తిగా చెడిపోయి పనికిమాలినవాడయ్యాడని పేరు తెచ్చుకున్న సత్యం, రామమ్మ బావిలో పడి చనిపోవటానికి కారణమయిన సత్యం, అమాయకుడనుకున్న సత్యం, దుర్మార్గుడనుకున్న సత్యం భయంతో గడగడలాడించిన సత్యం. నిరక్తితో మాట్లాడి కన్నీళ్లు తెప్పించిన సత్యం, నిష్కల్మషంగా మాట్లాడి కానుక అందించి చీకట్లోకి వెళ్ళిపోయిన సత్యం...ఇదంతా ఇట్లా ఎందుకవాలి?'

ఎద్దుమెడల్లో గంటలు గణగణ మోగాయి.

ఈరమ్మ ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చింది. చీకట్లో గుడ్డివెలుగు!

లాంతరు పట్టుకుని ఈరమ్మ భర్త కూలీలకి ఏదో పురమాయిస్తున్నాడు. కూలీలు బండిలోంచి ఓ మనిషిని తీసుకొని వచ్చి వాకిట్లో గడ్డివేసి దానిమీద పడుకోబెడుతున్నారు.

'ఇదుగో. ఏం చేస్తున్నావ్? అమ్మ పాలెందగ్గర పడుకుంది. కూలాళ్ళా నేనూ బండిగట్టుకుని వస్తావుంటే మన చెరువు మలుపుకాడ ఈ మనిషి పడివున్నాడు. ఆచార్లుగారు చూసి రక్తం కక్కుకుని చచ్చిపోయాడని చెప్పారు. నిన్న ఏంకడంటున్నాడు—పొద్దుటే బస్సుదిగి ఎదురయ్యాడట. ఎవరో చుట్టపు చూపుకని వచ్చి చచ్చిపోయాడు పాపం!' అన్నాడు ఈరమ్మ భర్త.

ఈరమ్మ ఉలిక్కిపడింది. అక్కడికి పరుగెత్తింది గాలిలాగా.

గుడ్డిలాంతరు వెలుతురులో గడ్డిమీద వెల్లకిలా నిర్జీవుడై పడివున్న సత్యాన్ని చూసి రక్తం మంచులా అయింది. విగ్రహంలా నిలబడివున్న ఈరమ్మ చేతిలోని చీరా, గుడ్డముక్కా జారి నేలపై పడినాయి. దూరాన్న స్మశానంలో ఓ నక్క అతి విచిత్రంగా అరచి గీ పెట్టింది. ●



# పుస్తకాలు

**ముఖాముఖి**

రచన : డాక్టర్ సి. నారాయణరెడ్డి, డెమ్మీ 80 పుటలు. మూల్యం రు. 2—50. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్లు, సికింద్రాబాదు, మద్రాసు.

కావ్య నిర్మాణానికి శక్తి, నిపుణత, అభ్యాసం— ఈ మూడూ అత్యంతావశ్యకాలని ప్రాచీన సాహిత్య వేత్తల అభిప్రాయం. ఇప్పటి నవకవులలో చాలా మందికి వీటిలో దేనితోనూ అవసరంలేదు. ఉత్సాహం వుంటే చాలు. కలం దానంతట అదే సాగిపోతుంది. కొన్నిచోట్ల ఆ ఉత్సాహానికి మిత్రుల ప్రోత్సాహం కూడా కారణం కావచ్చు. అందువల్లనే అట్టి కవిత నాలుగు కాలాల పాటు ఉండడానికి కాని, నలుగురు పఠనశ్రవణాల మూలంగా ఆనందించడానికి గాని అవకాశం లేకుండా పోతున్నది. డాక్టర్ నారాయణరెడ్డిగారు నవకవులైనా ఆ కోవకు చేరలేదు. కావ్యరచనకు కావలసిన సామగ్రినంతా పుష్కలంగా సంపాదించుకున్న మనీషులు. సాహితీ మర్మజ్ఞులు, సహజ కవితాధునీధురంధరులు. ఆధునికాంధ్ర కవిత్వాన్ని గురించి వీరి చేసిన పరిశోధన వీర ప్రాచ్య, నవ్య సాహిత్య కూలంకష విజ్ఞానానికి తార్కాణం. నేడు నవ్యకవితలోని విభిన్న మార్గాలన్నింటిలోనూ స్వేచ్ఛావిహారం చేసి జౌననిపించుకున్న రసికులు, అభ్యుదయ మార్గంలో కొనసాగినా వీరి కవితలో ఉద్రేక పూరితమైన విప్లవ ప్రబోధం కానరాదు.

డాక్టర్ నారాయణ రెడ్డి గారి నవ్యకృతులలో ముఖాముఖి ఒకటి. 1971లో రచింపబడిన వచన కవితల సంపుటి యిది. బాంగ్లాదేశ్ స్వాతంత్ర్యోద్యమం తీవ్ర రూపం ధరించడమూ, షేక్ ముజిబుర్ రహ్మాన్ వంటి ప్రాగ్వంగ మహానాయకుల నిర్బంధం, పాక్ సైనికుల రాక్షస కృత్యాలు యాహ్యాఖాన్ హత్యా ప్రోత్సాహక ధోరణి, లక్షల, కొలదీ అక్కవక్కులైన ప్రజల మారణ హోమం ప్రపంచదేశాల ఔదాసీన్యం భారత వీరుల సహాయం, వారి ధైర్యసాహసాలు, యాహ్యాఖాన్ తో కముడుపు పాక్ సైనికుల దాసోహం,బాంగ్లాదేశ్‌కు స్వాతంత్ర్యప్రాప్తి 1971లోనే జరుగడం, ప్రపంచంలోని ప్రతి వ్యక్తికీ విదితాలే. విషయాలను చాలా వరకు వ్యంగ్యధోరణిని, చివరకు వాచ్యంగానూ, ముఖాముఖిగా వర్ణిస్తూ శ్రీ నారాయణ రెడ్డిగారు రచించిన చతుర్వింశతి కవితలీ చక్కని అచ్చు కూర్పులో ఉన్నవి. కవితల చివర అవి రచింపబడిన తేదీలు నెలలూ యివ్వబడినందువల్ల ఆయారచనలను బట్టి ఆయా సందర్భాలుకూడా స్ఫురణకు వస్తూ ఉంటాయి.

ఏ కవిత కయినా స్పష్టత లేకపోతే— అరచన కవియొక్క అశక్తతనే స్పష్ట పరుస్తుంది. చాలా నవ్యకవితలు ఈధోరణిలో ఉండడం చాలా విచారకరం. కాని ముఖాముఖిలోని కవితలన్నీస్పష్టత కలిగివుండడం వల్ల సామాన్య పాఠకుల మనస్సులను కూడా ఆకర్షిస్తున్నది. అభిప్రాయావగతికి కొంత ఆలోచన అవసరం! అది ఉత్తమ కవితకు లక్షణం కూడా.

బాంగ్లాదేశ్‌ను గురించి యీనాడు ఎన్నో కవితలు వెలువడ్డాయి. చాలా వాటిలో యదార్థ చిత్రణతోపాటు ఆవేశం హద్దుల్ని తీక్రమించి, కాన వస్తుంది. ఈ రచయిత ఆవేశ పూరితులైనా కాక తమ మనోభావాలను సముచిత రీతిని వెల్లడించారు. ఇది దీవి ప్రత్యేకత. —అంగీరస ●




# అన్నింటికన్న రుచిగల ఆహారపదార్థమైన పానీయం వీవా

వీవా ఆధునికమైనది. పెద్దలకు యిదంటే యిష్టం. పిల్లలు యిదంటే మనసు పడతారు. గృహిణుల విశ్వాసాన్ని చూరగొన్నది వీవా. అందుకే అందరినీ ఆకట్టుకుంది వీవా.

ఎందువల్లనంటే వీవాలో శుద్ధమైన క్రీమ్‌గల పాలే కాకుండా యింకా ఎన్నో ఉన్నాయి. వీవాలో ఉన్న ప్రొటీనులు మీకు శక్తిని యిస్తాయి. వీవాలోని కార్బోహైడ్రేట్లు మీకు రోజంతా పని చేయటానికి కావలసిన స్ఫూర్తిని యిస్తాయి. వీవా గోధుమలు మరియు మాల్టెడ్ బార్లీతో పరిపూర్ణమైనది కావటంవలన, వీవా అన్నిటికన్న రుచికరమైన, బలవర్ధకమైన ఆహార పానీయం. వీవా ఆధునికమైన శాస్త్రీయ పద్ధతులతో తయారు చేయబడినది. అందుకే దీనిలోని బలవర్ధకమైన పదార్థాలు ఏమాత్రం నష్టము కావు. ఇది త్వరగా కరుగుతుంది కూడాను.

ఇవాళే మీ యింట్లోవాళ్ళ కోసం ఒక బాటిల్ వీవా తీసుకురండి. నూతన శక్తినీ, స్ఫూర్తినీ పొందండి.

ఎక్కువ రుచికోసం, అధిక శక్తి కోసం ఆధునికమైన వీవా

## ఆంధ్ర సారస్వత సమితి వార్షికోత్సవ సభలు

ఆంధ్ర సారస్వత సమితి పంచమ వార్షికోత్సవాల సందర్భంగా రచయితల సభలు ఒందరు పుర మందిరంలో వైభవంగా జరిగాయి.

ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన పుస్తక ప్రదర్శనమునకు త్రివేణి పత్రిక సంపాదకులు శ్రీ భావరాజు నరసింహారావు ప్రారంభోత్సవం చేశారు. వార్షికోత్సవ సంఘాధ్యక్షులు డా జె. ఎస్ రామకృష్ణ మూర్తి స్వాగతం పలికారు. కార్యదర్శి శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి నివేదిక సమర్పించారు. సర్వశ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి, ఎం వి. సుబ్బారావు (ఎమెస్కో) ప్రసంగించారు.

కవితా సదస్సుకు శ్రీ ఆర్. ఎస్. కె. మూర్తి అధ్యక్షత వహించారు సమితి అధ్యక్షులు శ్రీవిహారి స్వాగత చెపుతూ సమితి అయిదేళ్ళుగా చేస్తున్న సారస్వత సేవను వివరించారు. శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు 'వి—కత్వం,' శ్రీ ఎల్. కాంతారావు 'వచనకవిత— వస్తువైవిధ్యం' పై ప్రసంగాలు చేశారు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు 'ఎర్రగులాబీలు' కవితాసంకలనాన్ని ఆవిష్కరించారు.

కవి సమ్మేళమునకు శ్రీ కొడాలి ఆంజనేయులు అధ్యక్షత వహించారు. శ్రీ జి. సత్యనారాయణ స్వాగతం పలికారు. సర్వశ్రీ వి. నరిహరిశర్మ, శ్రీ బి. శ్రీనివాసగాంధి, కుమారి అద్దేపల్లి విద్యావతి సమ్మేళనంలో పాల్గొన్నారు.

రచయితల సమావేశం సమితి ఉపాధ్యక్షులు శ్రీ దొండపాటి దేవదాసు నిర్వహించారు. రచయితలు వారి సాధక బాధకాలపై చర్చ కొనసాగిన అనంతరం కొన్ని తీర్మానాలు ఆమోదించారు.

సాహిత్య సదస్సుకు శ్రీ ం. జి. వి ఎల్. ఎన్. రావు అధ్యక్షత వహించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ వి.వి.ఎస్ రామశర్మ స్వాగతం చెప్పారు శ్రీ బి. ఎస్. ఆర్. ఆంజనేయులు ప్రముఖుల పంపిన సందేశాల చదివారు శ్రీమతి ల 'నా తెలుగు నవల' శ్రీ పెదిభొట్ల సుబ్బరామయ్య తెలుగుకథ— తీరు తెన్నులు,' ఆదివిష్ణు —'తెలుగ నాటకాలు— ప రాగం' అనే విషయాలపై ప్రసంగించారు

ప్రత్యేక సంచికను లేడీయాంప్తిల్ నాసియల్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కె ఎం సుగుణ ఆవిష్కరించారు.

25 మంది జీవిత సభ్యులను సభకు పరిచయం చేశారు

అనంతరం సమితి నిర్వహించిన కథానిక, నాటిక, తా రచన పోటీలలో గెలుపొందిన వారికి శ్రీమతి ఎం సరళాదేవి బహుమతులనందజేశారు.

శ్రీ తులసీరావు బండ్ పార్టీ లలిత సంగీతకచేరీ, శ్రీ సలాం మోజస్ మోహన్‌చే 'తిమ్మరుసు' ఏకపాత్రాభినయం ప్రదర్శన జరిగాయి

సంయుక్త కార్యదర్శి శ్రీ జి. ఎస్ ఆర్ కె. ప్రసాదరావు వందన సమర్పణతో ఉత్సవాలు పూర్తి అయ్యాయి.

—సిమగు రామలింగయ్య



## ● దర్శకురాలయిన మరొక నటి!

## ● శిష్యుడు చిత్రానికి గురువు దర్శకత్వం!

మన ప్రసిద్ధ నటీమణులు శ్రీమతులు భానుమతి, సావిత్రిల వలె మరొక నటీమణి విజయనిర్మల దర్శకురాలయ్యారు ఆమె దర్శకత్వం వహిస్తున్నది తెలుగి చిత్రానికి కాదు సంగమమ్ పిక్చర్స్ వారి 'కవిత' అనే మళయాళ చిత్రానికి . . . ఈ చిత్రానికి ఆగస్టు 16వ తేదీ ఉదయం గం 9—5ని లకు విక్రమ్ స్టూడియోలో ప్రారంభం జరిగింది ప్రముఖ దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు క్లాప్ కొట్టారు జి కె. ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్ అధినేత శ్రీ జార్జి కెమెరా స్విచ్ ఆన్ చేశారు

తెలుగు, మళయాళ రంగాలలోని ప్రముఖులు ఈ చిత్ర ప్రారంభానికి వచ్చి, దర్శకురాలు శ్రీమతి విజయనిర్మలన ఆశీర్వదించారు. ఈ 'కవిత' చిత్రానికి దర్శకత్వం వహించటమేనాకి—ఇందులో కథానాయిక పాత్రను కూడా పోషిస్తున్నారు, విజయనిర్మల

'డైరెక్టర్‌గా 'కవిత' నాకు తొలి అనుభవం మంచి కథ. ఇది ఒక రకంగా విప్లవాత్మక ధోరణి కలిగినదని చెప్పవచ్చును ప్రయోగాత్మకమే కాదు, ప్రయోజనాత్మకమైనది కూడా యీ చిత్రం' అన్నారు విజయ నిర్మల

శుభం! 'కవిత' చిత్రం ద్వారా దర్శకుల జాబితాలోకి అడుగు పెడుతున్న విజయనిర్మల —పైన పేర్కొన్న నటీమణులవలె దర్శకత్వంలో ప్రజ్ఞ, నైపుణ్యం సంపాయిస్తే, ఆమె అభిమానులకు, శ్రేయోభిలాషులకు అంత కన్న సంతోషదాయకమైన వార్త ఏముంటుంది?

* * *

ఆదుర్తిగారి 'యాక్టింగ్ స్కూల్' లో చదువుకున్నాడు కృష్ణ. నటనలో అక్కడే పట్టభద్రుడయ్యాడు ఆయన చిత్రాల్లోనే మొదట నటించి, చక్కని భవిష్యత్తున్న నటుడనిపించుకున్నాడు కృష్ణ ఈ ఏడేళ్ళ కాలంలోనూ నటుడిగా ఒక ప్రక్క నిర్విరామంగా చిత్రాల్లో నటిస్తూ—మరొకప్రక్క స్వంతచిత్రాల నిర్మాణం, సంయుక్త చిత్రాల నిర్మాణం ఆరంభించాడు

అతను సమర్పించిన 'మోసగాళ్ళకు మోసగాడు' సంచలనం సృష్టిస్తే, పండంటికాపురం కొత్త రికార్డులు సృష్టిస్తున్నది అనన్యమయిన ఆర్థిక విజయాన్ని సాధిస్తున్నది 'పండంటి కాపురం'తో కృష్ణ అగ్రశ్రేణి నటుడిగాను, చక్కని అభిరుచులు గల నిర్మాతగాను ఎంతో ఎత్తులకు పెరిగాడు

కృష్ణ యివాళ ఇంత అభివృద్ధిని సాధించటానికి ఒకనాటి ముఖ్యకారకులలో శ్రీ ఆదుర్తి ఒకరు ఆ అభిమానం వల్లనో, ఆయన మీద తనకున్న గౌరవం వల్లనోగాని— తన స్వంత సంస్థ శ్రీ పద్మాలయ మూవీస్ మూడవ చిత్రానికి ఆయన్ని దర్శకత్వం వహించమని కృష్ణ కోరడం —అందుకు శ్రీ ఆదుర్తి అంగీకరించడం యిటీవల జరిగింది.

శిష్యుడు చిత్రానికి గురువు దర్శకత్వం వహించడం నిజంగా అభినందించదగ్గ విషయం—

—మోహన్ కుమార్

## వివాహం

శ్రీ చుండూరు నరసింహులు సెట్టిగారు (రిటైర్డ్ మేనేజరు, ఆంధ్రపత్రిక) సెప్టెంబరు మూడవతేదీ ఉదయం తమ చివరికుమార్తె చి. సౌ. గజలక్ష్మిని నామకల్ వాస్తవ్యులు శ్రీ టి. పి. రంగయ్యసెట్టిగారి మూడవ కుమారుడు చిరంజీవి శంకరయ్యకు ఇచ్చి తిరువళిక్కేణిలోని అలత్తూరు నాదమునిసెటి రామానుజకూటములో వైభవంగా వివాహం జరిపించారు ప్రముఖులు పలువురు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు. ●

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Editor : S. Radhakrishna.



"మరపురాని తల్లి"లో వాణిశ్రీ.

